కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-60 ఏప్రియల్-మే 2013

**మూలం:** **http://kottapalli.in/2013/05/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'ఎదిగే పిల్లడు':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల: రూ.25/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# మే మాసపు విందు

రంగారావుగారు చాలా పెద్ద మనిషి.

ప్రతి సంవత్సరం మే మాసంలో ఆయన ఓ గొప్ప విందునిచ్చేవారు- ఊళ్ళో పిల్లలందరికీ ఆ రోజు నిజంగా పండగలాగానే ఉండేది: ఒకవైపున వంటల హడావిడి; మరోవైపున మామిడి పళ్ళ హడావిడి! రంగారావుగారి విందులో గారెలు, బూరెలు, పులిహోర, పెరుగన్నాల భోజనంతో పాటు అందరికీ తిన్నన్ని మామిడిపండ్లు కూడా అందేవి మరి!

అందుకని ఏప్రియల్ మాసం వస్తోందంటే చాలు మేమాసపు విందుకోసం ఎదురు చూడటం మొదలు పెట్టేవాళ్ళు అందరూ.

రంగారావుగారి మామిడి తోటనంతా చూసుకునేవాడు రంగయ్యతాత. తోటలో ఎండిపోయినచెట్ల కొమ్మల్ని నరికేసి శుభ్రం చేయటం, నీరు కట్టటం నుండి పండ్లు కోసేంతవరకూ అంతా అతనే సొంతగా గమనించుకొని చేసేవాడు. విందునాడు అందరూ "అబ్బ! మామిడిపళ్ళు ఎంత తియ్యగా ఉన్నాయో!" అని మెచ్చుకుంటుంటే రంగయ్య మనసు సంతృప్తితో నిండిపోయేది.

అయితే ఓ సంవత్సరం మామూలుగానే వచ్చేసింది- ఉగాది.

పిల్లలందరూ వేపపూత కోసం, మామిడి పిందెలకోసం, చింతపళ్ళకోసం తోటల్లో వెతుక్కోవటం మొదలు పెట్టారు. రవి, సౌమ్య, కవిత, శాంతి, సుధాకర, పవన్.. వీళ్ళ బృందం ఒకటి రంగారావుగారి తోటవైపుకు వెళ్ళింది-

తోటంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడ చూసినా ఎండిపోయిన కొమ్మలు, కలుపు మొక్కలు కనిపించాయి. రంగయ్య తాత ఆరోగ్యం సరిగా ఉండట్లేదు. ఆ సంవత్సరం కూలివాళ్ళ సమస్య

కూడా తోడైంది. బావిలో నీళ్ళున్నాయి; కానీ మోటారు నడిచేందుకు కరెంటు లేదు.

"ఏమైంది తాతా?! ఎందుకిట్లాగ, ఈ సారి?" అడిగారు పిల్లలు.

"యవత్సు ఒక్కల్ల సేతి మీదిగా నడత్తంటే ఒక్కోతూరి ఇట్టాగే అవుతుంది పిల్లలూ! ఇన్నాల్లూ బాగున్న తోట కాస్తా, నా ఆరోగ్గెం పాడయ్యే మేలికి యలాగైందో సూడండి! ఈ సమ్మచ్చరం పూత బాగా వచ్చింది; పిందెలు బాగా పడ్డాయి; జాగర్తగా కాపాడితే కాతా బాగానే వత్తుంది- కానీ నాకు సెక్తి సాలటం లేదు. ఈసారి మే మాసపు విందుకి కాయలు తక్కువ పడతాయేమో!" అన్నాడు రంగయ్య తాత, నీరసంగా.

"అట్లా ఏం కాదులే తాతా, మేమందరం లేమూ?!" అన్నాడు రవి అనాలోచితంగా, తాత ప్రక్కన కూర్చొని.

"అవును తాతా! నువ్వు ఊరికే చెబుతూండు, ఏం చేయాలో; మాకు చేతనైనంత మేం చేసేస్తాం" అన్నది సుగుణ.

తాత నవ్వాడు- "బాగుంది-పసి పిల్లలు మీరేం సేత్తారులే. పెద్ద పెద్దోల్లకే పని కస్టం అనిపిత్తుంటేను" అన్నాడు.

"ఈ తోటలో మామిడి పళ్ళన్నీ తినేది మేమేగా?! అందుకని పనిలో మేం సాయం చెయ్యాల్సిందే " అన్నాడు సోము, అకస్మాత్తుగా పెద్దవాడైపోయి.

"అవునవును" అన్నారందరూ.

"పదండిరా, ముందు ఈ చెట్లన్నిటికీ పాదులు చేయాలి. కలుపు తీసేయాలి" చెప్పాడు రాఘవ.

పిల్లలందరూ పనిలోకి దిగారు; రంగయ్య వారిస్తున్నా వినకుండా.

క్రమం తప్పకుండా ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం రెండు రెండు గంటల పని మొదలెట్టారు.

వారం రోజుల్లో తోట మళ్ళీ దారికొచ్చింది.

మరో వారం తిరిగేసరికి తోటలో కోయిలలు కూశాయి.

పిల్లల నవ్వులతో, కేరింతలతో, శ్రమ శక్తితో పూతంతా కాత్తైంది.

వాళ్ళ జీవశక్తితో నిండి ప్రతికాయా ఉత్సాహంగా నవ్వింది.

రంగయ్య తాత ఆరోగ్యం బాగైంది.

"ప్రతిసారికంటే ఈసారి పళ్ళు ఇంకా చాలా మధురంగా ఉన్నాయి" అన్నారందరూ.

"పసి పిల్లలు- వాళ్లకెంత పట్టుదలో సూడండి. నేను ఒద్దన్నా వినకండా పని సేసారు. ఇదంతా వాల్ల కుసిపలితమే" అన్నాడు రంగయ్య తాత.

"మా పళ్ళు మేం పండించుకుంటాం, ఇకనుండీ!" అన్నాడు రాఘవ.

అది చాలు- ఇంక మే మాసపు విందు ఎన్నేళ్లయినా నిరాటంకంగా సాగుతుంది.

కొత్తపల్లికి ఈ మాసంతో ఐదేళ్ళు నిండుతున్నాయి. 2008 ఉగాదితో మొదలై ఇప్పటికి నిండుగా అరవై పుస్తకాలైన కొత్తపల్లిని అభిమానించి, ఆదరిస్తున్న మీకందరికీ నూతన సంవత్సర, మే మాసపు శుభాకాంక్షలు!

కొత్తపల్లి బృందం.

కొత్తపల్లి కథల పుస్తకంలో గత అయిదేళ్ళుగా వచ్చిన కథలన్నిటినీ ఇంటర్నెట్లో ఉచితంగా చదవచ్చు! పాటల్ని వినచ్చు! సందర్శించండి- http://kottapalli.in




# నీతి చంద్రిక

విగ్రహం-17

*జరిగిన కథ: గుడ్లగూబలు కాకుల నివాసాన్ని నాశనం చేశాయి; చాలా కాకులను పొట్టన పెట్టుకున్నాయి. మిగిలిన కాకులన్నీ సమావేశమై ఎప్పటికైనా ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాయి. ఒక ముసలి కాకి 'చిరంజీవి' ఒంటిపై రక్తం పులిమి, దానినక్కడ వదిలేసి, అన్నీ దూరంగా ఉన్న రుష్యశృంగానికి వెళ్ళిపోయాయి. ఇక చదవండి, నీతిచంద్రిక- 41 వ భాగం..*

'వెళ్ళేది తలారి ఇంటికే' అని తెలిసినవాడు నడిచినట్లు ప్రాణాలను అరచేత పట్టుకొని మెల్లగా నడుస్తూ ప్రొద్దుగుంకే వేళకు గుడ్లగూబలు నివాసం ఉండే కొండ గుహను చేరుకున్నది చిరంజీవి. ఆ గుహ ముందు నిలబడి, నీరసించిన స్వరంతో- "అయ్యో! రాజా!" అని గట్టిగా మూలిగింది. అది విని ఓ గుడ్లగూబ అదిరిపడి, లేచి బయటికి వచ్చి చూసింది. సొమ్మసిల్లి పడి ఉన్న కాకి ఒకటి కనిపించింది దానికి. దాన్ని తమ రాజు ఉపమర్దనుడి ముందుకు తీసుకుపోయి నిలబెట్టిందది. రక్తంతో తడిసి ముద్దయి ఉన్న

ఆ ముసలి కాకిని చూసేసరికి గుడ్లగూబలన్నిటికీ జాలి వేసింది-"ఎవరి కాకివి, నువ్వు? నీ గతి ఇట్లా ఎందుకైంది?" అని అడిగింది ఉపమర్దనం.



అప్పుడు చిరంజీవి బాధను, ఏడుపునూ అభినయిస్తూ, బొంగురుపోయిన గొంతు పెట్టుకొని "నా నోట మాట పెగలటంలేదు. ఏమని చెప్పాలి, నా గురించి?! నేను మేఘవర్ణుడి ప్రధానమంత్రిని- నా పేరు చిరంజీవి. ఇవాళ్ళ ఉదయం మేఘవర్ణుడు తన మంత్రులందరినీ పిలిచి "ఏం చేద్దాం?" అని అడిగాడు. నాకు అతని దురుద్దేశం తెలుసు- అయినా 'తోచిన మంచి చెప్పి చూద్దాంలే' అని "అయ్యా! ఉపమర్దనుడు బలవంతుడు. అందుచేత అతన్ని వేరే మార్గాలతో గెలవలేము- కేవలం భక్తి చేతనే అతన్ని అందుకొనగలం. అతని పాదాలు పట్టుకొని బ్రతకటం మంచిది. 'నేను రాజును' అనే దురభిమానం ఒకింత ప్రక్కన పెట్టి, వెంటనే ఆయనను దర్శించుకోండి. నా మాట విని ఆ కరుణాకరుడిని శరణువేడండి" అనగానే, ఏం చెప్పను?- ఆ తిక్కవాడి కోపానికి నెయ్యిని జోడించినట్లయింది నా మాటలతో. వాడు భగ్గున మండిపడి, కంటి కదలికలతోటే నాపట్ల ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తూ తన విధేయులైన మంత్రులను చూసి 'వీడు శత్రువుల పక్షం వహించి, ఒళ్ళు తెలీక పిచ్చివాడిలాగా మాట్లాడుతున్నాడు. దయ చూపకండి- వీడిని మీ వాడి ముక్కులతోపొడిచి ఇప్పుడే చంపేయండి' అని అరిచాడు. వాళ్ళు కూడావెంటనే కుక్కల మాదిరి నా మీదికి దూకి, నెత్తురు కారి కారి సొమ్మసిల్లిన నన్ను ముక్కులతో పొడిచారు; కాళ్లతోకుమ్మారు.

చివరికి 'చచ్చిపోయాడులే' అనుకొన్నారు. నన్ను అక్కడే వదిలేసి, వాళ్ల దారిన వాళ్ళు పోయారు. లోకంలో అట్లాంటి రాజులు ఉండబట్టే కదా, 'రాజ్యం తర్వాత నరకం తప్పదు' అన్న సామెత తయారైంది?!



ఇక నేను కొంతసేపటికి తేరుకొని, అన్నివైపులా చూసాను- ఎక్కడా ఎవ్వరూ లేరు- దాంతో నాకు ఎంత భయం వేసిందో చెప్పలేను. 'నావాళ్ళు' అనుకున్న బంధువులు, మిత్రులు అందరూ నన్ను దిక్కులేనివాడిగా వదిలేసి పోయారు. నా మనసు విరిగిపోయింది. చివరికి ఈ సంగతి మొత్తాన్నీ తమరికి విన్నవించుకోవాలనీ, ఆ పైన ప్రాణాలు విడిచినా పరవాలేదనీ నిశ్చయించుకున్నాను. శక్తి లేకున్నా. శరీరాంగాలు సహకరించకున్నా, ఈడ్చుకుంటూ ఈడ్చుకుంటూ తమరి సన్నిధికి చేరుకున్నాను. ఇక నాకు తమరే దిక్కు. శ్రద్ధ కలవాడికి విద్యాదానం, ఆకలిగొన్నవాడికి అన్నదానం, రోగికి ఔషధ దానం, భయ భీతులకు అభయదానం- ఇవి దానాల్లోకెల్లా ఉత్తమమైనవి' అని పెద్దలు చెబుతారు. దీనులను కాపాడటాన్ని మించిన రాజ ధర్మం మరొకటి లేదు. 'దుర్బలులకు బలం రాజు' అని వినిఉన్నాం కదా?

ఇదిగో, ఈ దేహం శాశ్వతం కాదు. అశాశ్వతమైన ఈ శరీరం కోసం శత్రువు చేసిన అవమానాన్ని మరచిపోయి సిగ్గులేకుండా ఎట్లా తిరిగేది? ఎవరికోసం బ్రతకాలి, ఇక నేను? అన్ని బంధాలనుండీ విముక్తుడినైనాను నేను. ఇక నాకు ఈ శరీరంతో మాత్రం పొత్తు ఎందుకు? అవసరం లేదు. ఇంతవరకూ ఆ పనికిరాని రాజు మేఘవర్ణుడికి సేవ చేసేందుకే ఈ ప్రాణాలు

బిగబట్టుకున్నట్లున్నది. నాకు ఎదురైనా ఈ దురవస్థనంతా తమరికి చెప్పుకోగలిగాను- కాదది చాలు. ధన్యుడినైనాను. ఇప్పుడిక ఏం జరిగినా మంచిదే. ప్రస్తుతం నేను బ్రతికి ఉండీ ఎందుకూ పనికిరాని శవం లాగా నిస్సారమైపోయి ఉన్నానంటే ఉన్నాను.




పగ తీర్చుకునే శక్తిలేక, కాలం కోసం ఎదురుచూస్తూ ఉన్నాను. ఆ దుర్మార్గులు నా ప్రాణాలను పూర్తిగా తీసినా పోయేది. ఎందుకో కొంచెం తక్కువ చేశారు. మీరైనా ఆ కొరత తొలగించి పుణ్యం కట్టుకోండి- మీ చేతుల్లో చచ్చి కనీసం కొంచెం పుణ్యం సంపాదించుకుంటాను.

ఇదివరలో నేను చాలా సార్లు తమరిని దర్శించుకోవాలనే అనుకున్నాను- కానీ ఏదైనా జరగాలంటే దైవం అనుకూలించాలి కదా! ఇప్పుడు, కనీసం ఈ విధంగానే అయితేనేమి, ఆ కోరిక నెరవేరింది. మీలాంటివారికి సేవ చేసుకునే భాగ్యం కేవలం మహా భాగ్యవంతులకు తప్ప, అందరికీ లభిస్తుందా?!

అదీగాక నేను అతని సభలో ఎల్లప్పుడూ తమరి చరిత్రాన్నే వేయినోళ్ళ కీర్తిస్తూ ఉండేవాడిని. దానికి అతను బాధపడి, అన్నింటా మిమ్మల్ని తిరస్కరిస్తూ ఉండేవాడు. ఆ కథలు త్రవ్వినకొద్దీ ఇంకా ఊరతాయిలెండి- వాటిని అటు ఉంచుదాం. నేను ఇన్ని సంవత్సరాలుగా చేసిన మేలంతా ఒక్కపూట వచ్చిన వరదలో కొట్టుకుపోయినట్లయింది. అందులో ఒక్క కోటవ వంతు మేలు తమరికి చేసి ఉన్నా, నా మనసు నిండిపోయేది కదా,అ నేనా చింత" అని ఆ దొంగకాకి పలు విధాలుగా వాపోయింది.

ఆ నంగనాచి మాటలకు ఉపమర్దనుడి మనసు మెత్తబడటాన్ని గమనిచిన మంత్రులు ముందుకు వచ్చి- "ప్రభూ! ఈ కాకికి వ్యతిరేకంగా చెబుతున్నామని మా మాటలను త్రోసిపుచ్చక, కొంచెం శ్రద్ధగా మా మనవిని ఆలకించండి.



ముందు కీడు ఎంచి, ఆపైన మేలు ఎంచాలి. శతృత్వాలు ఆమరణాంతం ఉండేవి తప్ప, ఇప్పట్లో అయితే తేలేవి కావు. ఇతని చరిత్ర చూద్దామా, అది ఏమంత పాతది కాదు. నిజానికి అదంతా మనకు తెలిసినదే. 'రాజన్నవాడు తనవారినే నమ్మి-నమ్మనట్లు ఉండాలి' అని చెబుతారు. ఇక పరాయివాడి పట్ల ఎలా ఉండాలో ఏం చెప్పాలి? ఆకు అలముల వెనక దాగి ఉన్న నుయ్యి లాంటిది, ఈ కాకి. దీన్ని నమ్మరాదు. మనం మతిమాలి 'నమ్మాము' అంటే ఇక దాని ఫలితం మన మెడకే చుట్టుకుంటుంది- వెదురు పండు మాదిరి, ఈ కాకి మొదలునే సమూలంగా నాశనం చేసే అవకాశం కనిపిస్తున్నది.

సందేహం లేదు. వీడు మనల్ని నాశనం చేయటం కోసం శత్రువుల గూఢచారిగా వచ్చాడు, ఇక్కడికి. ఇప్పుడు ఎక్కడాలేని మాయమాటలు చెబుతున్నాడు. వీడిని మన దగ్గర ఉంచుకోవటం దూదిలో నిప్పు కణికను దాచటమే అవుతుంది. కొండంత దూదికి కొండంత నిప్పు అవసరం లేదు కదా? మనల్ని అందరినీ నాశనం చేసేందుకు వీడొక్కడూ చాలు. శత్రువు ఎంత బలహీనుడయినా వాడికి మన రహస్యాలను తెలియనివ్వకూడదు. చెట్టులో చేరిన చెదల పుట్ట చెట్టునే చెరచదా? " అన్నాయి.

అట్లా తన మంత్రులందరూ ఆ కాకిని దరి చేరనివ్వద్దని ఎంత నొక్కి చెప్పినా, విధి మూడిన ఉపమర్దనుడు మటుకు వాళ్ళ మాట వినలేదు. తను పట్టిన పట్టును విడువలేదు. 'శరణు కోరిన వాళ్లను కాపాడటం కంటే మించిన ధర్మంలేదు- ఊరుకోండి' అని వాళ్ళు ఇక మాట్లాడకుండా చేసింది. ఏ విధంగా అయినా సరే, కాకిని కాపాడాల్సిందే అని ఒక సారి నిశ్చయించుకున్నాక, అది తన మంత్రులతో 'పుట్టుక వల్ల కాకి అయినంత మాత్రాన ఇతన్ని శత్రువుగా చూడకండి. సాధు జనుల్లోకెల్లా ముందు ఎంచదగిన గొప్పవాడు ఇతను. కలలో కూడా ఇతరులకు కీడు తలపెట్టే రకం కాదు. సత్యం తప్ప అబద్ధం అన్నదేదీ ఇతని నాలుక మీదికి రాదు. ఈ ప్రపంచంలోనే ఇతనికి సమానం అయిన అభిమానస్తుడు వేరొకడు లేడు. ఇతని మాటల తీరు ఇతని స్వభావాన్ని పూర్తిగా వెలువరిస్తున్నది. కేవలం మన పూర్వ పుణ్యం కారణంగానే మనకు ఈ చిరంజీవితో స్నేహం చేసే భాగ్యం కలుగుతున్నది. మనకు ఇతను పూర్తిగా నమ్మదగినవాడు. అక్కడా ఇక్కడా అనక మన మందిరంలో అంతటా ఇష్టం వచ్చినట్లు తిరగ గలిగిన వాడు. ఇవాల్టినుండి మీరు మీ పాత భావాలను విడనాడాలి- ఇతనిని అత్యంత ఆదరాభిమానాలతో గౌరవంగా చూసుకోవాలి' అని చెప్పేసింది.

అది మొదలు ఆ కాకి ఉపమన్యుడికి ఇష్ట సఖుడయి, గుడ్లగూబల మందిరంలో యధేచ్ఛగా తిరగటం మొదలు పెట్టింది.

(ఆ తర్వాత ఏమయిందో మళ్ళీ చూద్దాం...)

**సిక్సర్!**

నవ్వు!

చిన్న (ఏడుస్తూ) : నాన్నా! అన్నయ్య సిక్స్ కొట్టాడు!

నాన్న: సిక్స్ కొడితే సంతోషంగా చప్పట్లు కొట్టాలిరా, ఏడుస్తున్నావెందుకు?

చిన్న: వాడు కొట్టింది ఆరు మొట్టికాయలు!

# చిలుక తెలివి

బొమ్మల కథ

*సేకరణ: ఎమ్. రచన, 3 వ తరగతి, Z.P.S.S, తరాలపల్లి, వరంగల్ జిల్లా*

ఒక సారి టక్కరి నక్క ఒకటి అడవి దారిన పోతూ ఉంటే, ఓ చెట్టు కొమ్మ మీద కూర్చొని కనిపించిందొక చిలుక.




"దాన్ని గుటుక్కుమనిపిస్తే బాగుంటుంది కదా!" అనిపించింది నక్కకి.




అది చిన్నగా ఆ చిలుక ఉన్న చెట్టు కిందకు చేరి- "చిలుకా! చిలుకా! నీ రెక్కలు భలే ఉన్నాయి చూపించవా!" అన్నది.

చిలుక మురిసి పోయింది. రెక్కలు టప టపా ఆడించి అరిచింది.

ఈసారి "చిలుకా! చిలుకా! నీ కాళ్ళు- అబ్బ, నీ కాళ్ళు భలే ఉన్నాయి చూపించవా!" అన్నది నక్క.

చిలుక మురిసి పోయింది. రెండు కాళ్ళనీ అటూ ఇటూ కదిలిస్తూ నాట్యం చేసింది.







ఈసారి - "చిలుకా! చిలుకా! నీ కంటి రెప్పలు ఎంత బాగున్నాయో! చూపించవా?!" ముద్దుగా అన్నది నక్క.

చిలుకకు మునగ చెట్టు ఎక్కినట్లయింది. మురిసిపోయి, ఒక్క క్షణం పాటు తన కంటి రెప్పలు మూసింది- అంతే- నక్క ఒక్క ఉదుటన ఎగిరింది. చటుక్కున చిలుకను నోట కరుచుకుంది.

జరిగింది అర్థమయ్యే సరికి చిలుక గుండెలు గబగబలాడాయి. ప్రాణాలు కడబట్టాయి.

అయినా ఒక ప్రయత్నం చేద్దామనుకుంది:

"నక్క బావా! నక్క బావా! నీ చేతికి ఎట్లాగూ చిక్కాను. ఇక ఎలాగూ చస్తాను. చనిపోయే ముందు ఒక్క సారి నీ గొంతు వినాలని ఉంది: నోరు తెరిచి 'చిలుకా' అని పిలువు ముందు" అంది.







నక్కకు చిలుక తెలివి అర్థమయింది. "నేను నోరు తెరిస్తే తప్పించుకుందామనుకుంటోంది, ఈ దొంగ చిలుక!" అనుకున్నది. కోపం వచ్చింది: "ఒసే చిలుకా! నీ తెలివి నా దగ్గర సాగదు. నేను నోరు తెరిస్తే పారి పోదామనేగా, నీ ప్రయత్నం?!" అంది.

అయితే పాపం ఆ మాట అనడానికైనా అది నోరు తెరవాల్సిందే కదా?

నక్క నోరు తెరిచింది; చిలుక తుర్రున ఎగిరి పోయింది! "ఇంకెప్పుడూ పొగడ్తలకు లొంగను" అనుకున్నది మరోసారి.



# కుందేలును కాపాడిన రాజేష్

బొమ్మకు కథ

రచన: తవ్వా లక్ష్మీప్రసూన, సీనియర్ ఇంటర్, మేధా జూనియర్ కాలేజి, మైదుకూరు, కడప జిల్లా



పట్టణంలోని విద్యానికేతన్ పాఠశాలలో ఆరవ తరగతి చదువుతున్నాడు రాజేష్. వాడికి జంతువులన్నా, పక్షులన్నా ఎంతో ఇష్టం. ముఖ్యంగా చిన్ని చిన్ని జీవులంటే మరీ మరీ ఇష్టం.

రాజేష్ వాళ్ళ అమ్మమ్మ వాళ్ళు అడవికి దగ్గరగా ఇల్లు కట్టుకుని వ్యవసాయం చేస్తూ ఉండేవాళ్ళు. సెలవులు వచ్చాయంటే చాలు- రాజేష్ వాళ్ళంతా అమ్మమ్మ గారి ఇంటికి వెళ్ళిపోయేవాళ్ళు. అక్కడ అడవిలో జంతువులను పక్షులను దగ్గరిగా చూస్తూ ఆనదించేవాళ్ళు.

ఈ సారి సెలవుల్లో కూడా అమ్మమ్మ గారి ఊరికి వెళ్ళాడు రాజేష్. అడవిలో అంతా కులాసాగా తిరుగుతూ రేగు పండ్లు కోసుకుంటూ ఉండగా రాజేష్ కు ఒక బుజ్జి కుందేలు కనిపించింది. అది చాలా నెమ్మదిగా, బాధగా నడుస్తూ ఉంది. రాజేష్ ఆ కుందేలు దగ్గరికి వెళ్ళి "బుజ్జి కుందేలా... ఎందుకు, అట్లా బాధగా నెమ్మదిగా నడుస్తున్నావ్?" అని అడిగాడు.

"ఏం చెప్పను? మా అమ్మ, నాన్న, ఇద్దరు అన్నయ్యలు , నేనూ- అందరం ఈ అడవిలో హాయిగా కలిసి జీవించేవాళ్ళం. అయితే ఒక రోజున నేను జామ కాయలు తిందామని వాళ్లకు కాస్త దూరంగా అడవిలోకి వెళ్ళాను. మళ్ళీ తిరిగి వచ్చాక ఎంత వెతికినా ఇంక మా

వాళ్ళెవరూ కనిపించనేలేదు!

అమ్మ వాళ్ళను ఎవరో పట్టణపు మనుషులు పట్టుకుని వెళ్తుండగా చూశానని కాకి మామయ్య చెప్పాడు! " అని బుజ్జి కుందేలు ఏడవటం మొదలుపెట్టింది.

రాజేష్ చాలా బాధ పడ్డాడు. "మీ అమ్మ వాళ్ళను ఎవరో ఎత్తుకెళ్ళి ఎన్నిరోజులైంది?" అడిగాడు.

"రెండు రోజులైంది.. వాళ్ళను చూడకుండా ఉండలేనన్నా" ఏడుస్తూ చెప్పింది బుజ్జి కుందేలు.

"బుజ్జీ.. నువ్వు ఏడ్వొద్దు.. నువ్వు ఏడిస్తే నాకు కూడా ఏడుపు వస్తుంది. మాదికూడా పట్టణమే.. అక్కడ ఒక పెద్ద జంతు ప్రదర్శనశాల ఉంది. అక్కడ కొత్తగా కుందేళ్ళ ప్రదర్శనను కూడా ఒకదాన్ని ఇటీవలే ప్రారంభించారని పేపరులో చదివాను. మీ అమ్మ వాళ్ళను పట్టణపు వాళ్ళు అక్కడికే తీసుకు వెళ్ళి ఉంటారు.. నువ్వు నాతో రాగలవా, మీ అమ్మ వాళ్ళు అక్కడ ఏమైనా ఉన్నారేమో చూద్దాం? " చెప్పాడు రాజేష్.

ఆ మాటలను బుజ్జి కుందేలు ఎగిరి గంతేసింది. మళ్ళీ బాధగా ముఖం పెట్టింది.

"ఎందుకలా మళ్ళీ బాధపడుతున్నావ్?" బుజ్జి కుందేలును అడిగాడు రాజేష్.

"నువ్వు కూడా పట్టణపు అబ్బాయివే కదా? 'అసలు మనుషులనే నమ్మొద్దు' అని చెప్పేది మా అమ్మ. మరి నిన్ను నమ్మొచ్చా? నువ్వు నన్ను ఏం చెయ్యవుగా?!" అనుమానాన్ని బయట పెట్టింది బుజ్జి కుందేలు.

"నీకేం కాదు- నన్ను నమ్ము. నిజానికి పిల్లలెవ్వరూ నీలాంటి చిట్టి కుందేళ్లను ఏమీ చెయ్యరు అసలు. అమ్మ తోడు.." అని రకరకాలుగా చెప్పాడు రాజేష్.

బుజ్జి కుందేలుకు నమ్మకం కుదిరింది. రాజేష్‌తోపాటు అది కూడా పట్టణానికి బయలుదేరింది. బుజ్జికుందేలును ఇంటికి తీసుకెళ్ళి వాళ్ళ నాన్నకు పరిచయం చేశాడు రాజేష్. రాజేష్, వాళ్ళ నాన్న ఇద్దరూ బుజ్జి కుందేలును జంతు ప్రదర్శనశాలకు తీసుకువెళ్ళారు.

అక్కడ ప్రదర్శనలో చాలా కుందేళ్ళు కనబడ్డాయి. వాటిలో బుజ్జి కుందేలు అమ్మానాన్నలేవో అర్థం కాలేదు రాజేష్‌కు. అయితే బుజ్జి కుందేలు అరుపులు విని అవే వీళ్ళ దగ్గరికి పరుగున వచ్చాయి. బుజ్జి కుందేలు సంతోషానికి మేరలేదు.

కుందేళ్ళు కొన్ని వీళ్ళ దగ్గరికి వచ్చి మాట్లాడుతున్నాయన్న వార్త విన్న జంతు ప్రదర్శనశాల అధికారులు తమంతట తామే వచ్చారు అక్కడికి. రాజేష్ వాళ్ళ నాన్న ఆ అధికారులతో మాట్లాడారు. ప్రదర్శన కోసం అడవిలోంచి తెచ్చిన కుందేళ్ళను ఆ ప్రదర్శన అవ్వగానే తిరిగి అడవిలోనే వదిలేస్తామని చెప్పారు వాళ్ళు. 'మీరు వాటిని ఇంతగా ప్రేమిస్తున్నారు కాబట్టి, మీకోసం వాటిని ఇప్పుడే వదిలెయ్యమంటే వదిలేస్తాం' అని కూడా అన్నారు వాళ్ళు.

'ఇప్పుడే వదిలెయ్యండి. ఈ చిట్టి కుందేలు వాటికోసం ఎంతగా తపించిపోతున్నదో చూశారుగా?' అన్నారు రాజేష్‌వాళ్ళ నాన్న.

రాజేష్‌ను, వాళ్ల నాన్నను తన వాళ్లకు పరిచయం చేస్తూ జరిగిన కథంతా చెప్పింది బుజ్జి కుందేలు. కుందేలు అమ్మ నాన్నలు రాజేష్‌కు, వాళ్ళ నాన్నకు మళ్ళీ మళ్ళీ ధన్యవాదాలు చెప్పాయి.

బుజ్జికుందేలును, వాళ్ళ బంధువులను అందరినీ అడవికి తీసుకెళ్ళి వదిలారు. ఇప్పుడు రాజేష్‌కు అడవిలో నిండా స్నేహితులే! సెలవులు వచ్చినప్పుడు ఇక వాడు ఊరికి వెళ్ళేది అమ్మమ్మని చూసేందుకు కాదు- అడవిలో దండిగా ఉన్న తన మిత్రుల్ని కలిసేందుకే! 

నవ్వు!

నాన్న: చరణ్! భూమి గుండ్రంగా ఉందని ఎవరు చెప్పారు?

చరణ్: మా సోషల్ అయ్యవార్ చెప్పారు నాన్నా!



# మారిన వేటగాడు

*రచన: ప్రవీణ, 7 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి.*

అనగనగా ఒక చిన్న గ్రామం ఉండేది. ఆ గ్రామానికి నాలుగు వైపులా అడవి ఉంది. ఆ గ్రామంలో రామభద్రయ్య అనే వేటగాడు ఒకడు ఉండేవాడు. అతను మహా క్రూరుడు- ఏమాత్రం దయా దాక్షిణ్యాలు లేవు అతనికి. అయితే అతని భార్య సీతమ్మ మంచిది, అమాయకురాలు. వాళ్లకి ముగ్గురు కూతుళ్ళు. భార్య పిల్లలు ఎవ్వరికీ రామభద్రయ్య వేటాడటం ఇష్టం ఉండేది కాదు. "ప్రాణులను హింసించే ఆ వృత్తివద్దు; వేరే ఎదైనా కొట్టు పెట్టుకుందాం" అంటే కూడా అతను వినేవాడు కాదు. మొండిగా వేటాడటం తోనే సంపాదించేవాడు. అతనంటే గ్రామస్థులకి కూడా పెద్దగా ఇష్టం ఉండేది కాదు. క్రూరుడైన వేటగాడిని చూస్తే ఎవరికి ఇష్టం ఉంటుంది?



ఇలా ఉండగా ఒక రోజు ఎప్పటిలాగానే వేటాడి అడవి నుంచి వెనక్కి వస్తున్న సమయంలో రామభద్రయ్యకి అందమైన లేడి ఒకటి కనబడింది. ఆ సరికే చీకట్లు అలుముకుంటున్నాయి. అయినా సరే ఆ లేడిని దక్కించుకోవాలనుకున్నాడు. ధనుర్బాణాలు ఎత్తుకొని లేడి వెనుకాల పరుగు తీసాడు. మొదటి బాణం విసిరాడు- గురి తప్పింది. రెండవ బాణం విసిరాడు- మళ్ళీ గురి తప్పింది. ఇక మూడవ బాణం మటుకు సూటిగా పోయి లేడి మెడ మీద గుచ్చుకొంది.

విలవిల లాడుతూ కిందపడిన ఆ లేడి ఓ దేవతలాగా మారింది- "ఓరీ నీచుడా! నీ భార్యాబిడ్డలు ఎంత చెప్తున్నా వినకుండా, గ్రామస్థులు అసహ్యించుకుంటున్నా పట్టించుకోకుండా వేటాడటాన్నే నీ వృత్తిగా ఎన్నుకున్నావు. జీవించేందుకు అనేక మార్గాలున్నా ఇలా ఇతర ప్రాణులను హింసిస్తున్నందుకు నువ్వు తగిన శాస్తి అనుభవిస్తావు. నీకు కూడా లేడి జీవితం లభిస్తుంది చూడు!" అంటూ కన్ను మూసింది. మరుక్షణం రామభద్రయ్య కాస్తా లేడిగా మారిపోయాడు.

అతని కోసం రాత్రంతా ఎదురు చూశారు భార్యబిడ్డలు. ఉదయాన్నే లేచి తలుపు తెరిచిన సీతమ్మకు గడప మీద పడుకుని కనబడింది ఒక లేడి. ఆమె దాన్ని దూరంగా తరిమేసింది. పిల్లలతోబాటు అడవంతా గాలించటం మొదలు పెట్టింది రామభద్రయ్య కోసం. ఊళ్ళో వాళ్ళందరినీ అడిగింది. ఎవరిని అడిగినా "మాకు తెలియదంటే మాకు తెలియదు" అన్నారు. ఇట్లా రోజూ ఆ లేడి రావటం,

సీతమ్మ దాన్ని తరిమేయటం జరిగింది. ఇట్లా మూడు రోజులు గడిచాయి.



నాలుగో రోజున ఇక లాభం లేదని పిల్లలిద్దరూ బడికి వెళ్ళారు. అడవిలో దిక్కుతోచకుండా తిరుగుతున్న సీతమ్మను చూసేసరికి లేడి రూపంలో ఉన్న రామభద్రయ్య సంతోషం పట్టలేకపోయాడు. ఆమె దగ్గరికి రాబోయాడు. అదే సమయంలో ఆ లేడిని చూశాడొక వేటగాడు. వాడు దాన్ని వెంటాడి తరమటం మొదలుపెట్టాడు. చేత విల్లంబులు పట్టుకొని యముడి లాగా వెంట పడుతూ ఆ వేటగాడు ఒకదాని తర్వాత ఒక బాణం వేస్తుంటే, ప్రాణభయంతో పరుగు తీశాడు రామ భద్రయ్య . ఆ హడావిడిలో లేడికి తగలాల్సిన బాణం ఒకటి నేరుగా పోయి సీతమ్మకి తగిలింది. వేటగాడికి భయం వేసింది. సీతమ్మను అక్కడే వదిలేసి ఎటో పారిపోయాడు వాడు.

సీతమ్మ క్రింద పడి విలవిలలాడుతున్నది. గాయం నుండి రక్తం కారుతున్నది. భార్య దగ్గరే కూర్చొని ఏడవసాగాడు రామభద్రయ్య.

"ఏమండీ! ఎందుకు ఏడుస్తున్నారు? లేవండి- తెల్లవారింది" అంటూ కదుపుతున్న సీతమ్మను కళ్ళు తెరిచి చూశాడతను. "కలగన్నారా, ఏదోచెడ్డకల వచ్చినట్లుంది?" అని అడుగుతున్నదామె.

రామభద్రయ్య కి అర్థమైంది- 'ఇదంతా కల' అని.

అయినా ఇక అతను వేటాడటం మానేశాడు. తన వృత్తిని మార్చుకున్నాడు. 



# అసలైన విద్య

*సేకరణ: ఎస్. మౌనిక, 8 వ తరగతి, ప్రజ్ఞ పబ్లిక్ స్కూలు, అద్దంకి*

కోసల దేశంలో ఓ గురుకులాన్ని నడిపిస్తారు జయనాధుల వారు. ఆయన దగ్గర చాలా మంది రాజ కుమారులు శిక్షణ పొందేవాళ్ళు. శాస్త్రాలతోపాటు ఆయన వారికి చాలా యుద్ధ విద్యలు నేర్పేవారు. అట్లా శిక్షణ పొందిన వాళ్లలో ఒకడు, అజేయుడు అనేవాడు.

చిన్న వయసు నుంచే విల్లు విద్య, మల్ల యుద్ధం, గుర్రపు స్వారి- ఇట్లా రకరకాల విద్యల్లో ప్రావీణ్యత పొందాడు అజేయుడు. పోటీలన్నింటిలోనూ తోటి విద్యార్థుల కంటే ఒక అడుగు ముందు ఉండేవాడు. కొన్ని కొన్ని విద్యల్లోనైతే అతడి నైపుణ్యం గురువును మించి ఉంటుందని అనుకునేవాళ్ళు అతని మిత్రులు. అట్లాంటి మాటలు విన్నకొద్దీ అజేయుడికి తన శక్తి మీద విపరీతమైన నమ్మకం వచ్చేసేది. గురువుగారు తనను అనవసరంగా

గురుకులంలో ఇరికించి పెట్టుకుంటున్నారనీ, తను అన్ని విద్యల్లోనూ ప్రవీణుడైనా కూడా తనను ఇంటికి పంపటంలేదనీ అనిపించేది అతనికి.



కొన్ని రోజుల తర్వాత అజేయుడు ఇక ఆగలేకపోయాడు- జయనాధులవారి దగ్గరికి వెళ్ళి "స్వామీ! నేను అన్ని విద్యల్లోనూ ప్రవీణుడినయ్యాను కదా, ఇక నాకు సెలవు ఇప్పించండి. నేను వెళ్ళి రాజ్య సంరక్షణలో పాల్గొంటాను" అన్నాడు.

గురువుగారు అతని మాటలు విని, చిరునవ్వు నవ్వారు. అతని చేతికొక విల్లునిచ్చి "దీన్ని పట్టుకో! నాతో రా! అన్నారు. దగ్గరలోనే ఉన్న ఒక సెలయేటి దగ్గరికి వెళ్ళారు ఇద్దరూ.

సెలయేరు ఉధృతంగా పారుతున్నది . దాని మీద అడ్డంగా తాటిమాను ఒకటి వేసి ఉన్నది. "ఇదిగో! ఈ తాటిమాను మీదుగా నడుద్దాం, రా! అవతలివైపుకు వెళ్దాం!" అన్నారు జయనాధులవారు. వీళ్ళు నడుస్తుంటే తాటిమాను అటూ ఇటూ ఊగుతున్నది. నది మధ్యలోకి చేరుతామనగా అజేయుడిని ఆగమన్నారు జయనాధులవారు. "అజేయా! అదిగో అటు చూడు; నదికి ఆవలి ఒడ్డున లక్ష్యం ఒకటి ఏర్పాటు చేసి ఉన్నాను. ఇక్కడినుండి బాణాలు సంధించు. లక్ష్యాన్ని ఛేదించటం ఎంత సులువో చూపించు!" అన్నారు.

"దానిదేముంది గురువర్యా! ఒక్క బాణమూ తప్పకుండా లక్ష్యాన్ని ఛేదిస్తాను చూడండి" అని అజేయుడు ధనుస్సునెత్తి లక్ష్యానికి గురి పెట్టాడు. అంతలో అతను నిలబడిన తాటి మాను గజ గజా వణికింది- బాణం లక్ష్యాన్ని

తప్పి వేరే ఎటోవెళ్ళి పడింది! ఇట్లా అజేయుడు వరసగా చాలా బాణాలు వేశాడు. కానీ అన్నీ ఎటెటో వెళ్ళి పడ్డాయి. కంగారు కొద్దీ తబ్బిబ్బయిన అజేయుడు ఒక్కపెట్టున నీళ్ళలో పడబోతూ కేకలు వేసాడు- జయనాధులవారు అతన్ని కాపాడి సరిగా నిలబెట్టారు. అటుపైన అంతటి ప్రవాహంలోనూ తాటిమాను మీద ఒంటికాలిపై నిలబడి ఒకే బాణంతో లక్ష్యాన్ని ఛేదించి చూపారాయన!

జయనాధుడు సిగ్గుతో తలవంచుకున్నాడు.

"విలుకాడంటే విల్లు సంధించటంలోనే కాదు; శరీరాన్న నిశ్చలంగా ఉంచటం లోను, మనసును నిగ్రహించి నిలపటంలోనూ కూడా ప్రావీణ్యత సాధించాలి- అప్పుడే విద్య పూర్తయినట్లు. విలువిద్యకే కాదు, నిజానికి ఏ విద్యకైనా ఇది అవసరం. నువ్వు ఆ దశకు ఇంకా చేరుకోలేదు. ఆ రోజు వచ్చినపుడు నేనే నిన్ను రాజ్య సంరక్షణకు పంపిస్తాను. తొందరపడకు" అని జయనాధుల వారు చెబితే, ఇప్పుడు అవుననిపించింది అజేయుడికి! 

నవ్వండి!

**తమాషా రోడ్డు!**

రాజు: ఏంట్రా, ఉదయం నుండీ ఇక్కడే కూర్చున్నావు?

వెంగళప్ప: ఉదయం ఒకతను ఈ రోడ్డు విజయవాడ వెళ్తుందని చెప్పాడు. ఆ తమాషా చూడ్డానికి..!

**సర్దుబాటు!**

జ్యోతిష్యుడు: మీరు నిండా డెభ్భై ఏళ్ళు నిశ్చింతగా బ్రతుకుతారు.

సుబ్బారావు: అయ్యో రామ! నాకిప్పుడు ఎనభై ఏళ్ళొచ్చాయి!

జ్యోతిష్యుడు: అదే, నేను చెప్పేది- డెభ్భై ఏళ్ళు నిశ్చింతగా బ్రతికాక, మరికొన్నేళ్ళు కష్టపడుతూ బ్రతుకుతారు.




# పగటి కలలు

*రచన: సి.నందకిశోర్, 7 వతరగతి, రిషివ్యాలీస్కూల్.*

అనగనగా ఒక అడవి. ఆ అడవిలో ఒక పాడుబడిన పెంకుటిల్లు; దాని పక్కన ఒక పెద్ద చెరువు ఉంది. ఆ అడవి నుంచి రెండు కిలో మీటర్ల దూరంలో ఒక పల్లె ఉంది. ఆ పల్లెలోని వాళ్ళు తమ ఆవులను, మేకలను మేతకోసం ఆ అడవికే తీసుకొచ్చేవాళ్ళు. మధ్యాహ్నం సమయంలో వాటిని దగ్గర్లో వదిలి, వాళ్లు ఆ పాడుబడిన ఇంట్లో కాసేపు విశ్రాంతి తీసుకునేవాళ్ళు.

అదే ఊళ్ళో రాముడు అనే పేద యువకుడు ఒకడు ఉండేవాడు. వాడికి ఉన్నదల్లా ఒక్కటంటే ఒక్క మేక. తన మేకను కూడా వాడు మేతకోసం అందరిలాగా అడవికి తీసుకెళ్ళి వదిలేవాడు. అటుపైన రోజంతా ఆ పెంకుటింట్లో పడుకుని నిద్రపోతుండేవాడు.

ఎప్పటిలాగానే ఒకరోజున వాడు ఆ

పెంకుటింట్లో పడుకొని, ఎట్లా నిద్రపోయాడో మరి, ఇక చీకటి పడినా లేవలేదు. రాత్రి పన్నెండు గంటలప్పుడు ఏదో శబ్దం అవడంతో ఉలిక్కిపడి లేచాడు. బయట అడవిలో పండు వెన్నెల కాస్తున్నది. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. చెరువు దగ్గర మాత్రం, తెల్లగా మెరుస్తున్న గుర్రాలు కొన్ని గుంపుగూడి ఉన్నాయి. వాటన్నిటికీ నుదుటిమీద ఒక కొమ్ము ఉన్నది. తెల్లగా బలంగా ఉన్న ఆ గుర్రాలని చూసే సరికి రాముడు ఉత్సాహం పట్టలేకపోయాడు. వాటిని పట్టుకోవాలని ఉత్సాహంగా అరుస్తూ పరుగుపెట్టాడు.

అప్పటివరకూ ప్రశాంతంగా ఉన్న గుర్రాలన్నీ వీడి అరుపులు వినేసరికి ఎటుపడితే అటు పరుగు తీశాయి. చూస్తూండగానే వాటి రెక్కలు విచ్చుకున్నాయి. అవన్నీ ఆకాశంలోకి ఎగిరి కనుమరుగౌతుంటే రాముడు నోరు తెరుచుకొని చూస్తూ ఉండిపోయాడు.

అయితే ఆ తర్వాత వాడిలో ఆలోచన మొదలైంది. 'అయ్యో! నేను నిశ్శబ్దంగా వెళ్తే బాగుండేది కదా, కనీసం ఒక్క గుర్రాన్నయినా పట్టుకునేవాడిని!' అని విచారం వేసింది వాడికి. 'దానిదేముందిలే- ఇక్కడే ఉంటాను; రేపు రాత్రి గుర్రాలు వచ్చాక, మెల్లగా వెళ్ళి వాటిని పట్టుకుంటాను!' అనుకున్నాక, వాడికి మళ్లీ ఉత్సాహం వచ్చేసింది.

తరువాతి రోజు రాత్రి సరిగ్గా అదే సమయానికి ఆకాశంలోంచి మెల్లగా దిగివచ్చాయి గుర్రాలు.



రాముడు ఈసారి చప్పుడు చేయలేదు.

మెల్లగా చెట్లను చాటు చేసుకుంటూ చెరువు దగ్గరకి వెళ్ళి, తటాలున ఒక గుర్రాన్ని పట్టుకున్నాడు. ఆ గుర్రం గట్టిగా సకిలించి పెనుగులాడేసరికి, మిగిలిన గుర్రాలుకూడా

సకిలించాయి. అదేదో సంకేతం అన్నట్లు, గుర్రాలన్నీ ఒక్కసారిగా గాలిలోకి ఎగిరి ఆకాశంలో ప్రయాణించటం మొదలు పెట్టాయి!

గుర్రాన్ని గట్టిగా పట్టుకున్న రాముడు కూడా దానితోబాటు ఆకాశంలోకి ఎగిరాడు. గుర్రం వేగానికి రాముడికి ఊపిరాడనట్లు అయింది. అయినా వాడు గుర్రాన్ని గట్టిగా పట్టుకొని కళ్ళు మూసుకున్నాడు. కొంతసేపటికి గుర్రం వేగం తగ్గింది. రాముడు కళ్ళు తెరిచి చూసేసరికి అవన్నీ ఒక పెద్ద భవనంలో వాలుతున్నాయి. చూస్తూండగానే ఆ గుర్రాలన్నీ అందమైన అప్సరసలుగా మారిపోయాయి. రాముడు ఆశ్చర్యంతో నోరు తెరిచి వాళ్ల వైపు చూస్తూ ఉండిపోయాడు. వాళ్ళంతా రాముడి చుట్టూ చేరి "ఓ మనిషీ! ఇన్నేళ్ళుగా మా గురించి మానవ మాత్రుడికి తెలీదు. ఇప్పుడు తెలిసో తెలీకో, నువ్వు మమ్మల్నితాకావు. మా నియమం ప్రకారం మమ్మల్ని తాకిన వాళ్లు ఇక మనుష్యలోకంలో ఇమిడే అవకాశం లేదు. నువ్విక జీవితాంతం ఇక్కడే ఉండాలి, తప్పదు' అన్నారు కఠినంగా.

"ఆహా! నాకంత అదృష్టమా?!" అనుకున్నాడు రాముడు. సంతోషంగా తల ఊపి "సరేలే, ఇక్కడే ఉంటాను' అన్నాడు. ఇక ఆ రోజు నుండీ అందమైన దుస్తులు ధరిస్తూ, రకరకాల పిండి వంటలు తింటూ అక్కడే ఉండటం మొదలుపెట్టాడు.



అయితే కొన్ని రోజులు గడిచేసరికి, వాడికి ఇక ఆ స్థలం అంటే అయిష్టం మొదలయింది-'స్వర్గంలో ఎవరూ ఎవరినీ పట్టించుకోవటం లేదు! ఇంట్లో అయితే అమ్మ,

నాన్న అందరూ తనని ఎంతగానో ఇష్టపడుతుంటారు. తన మేకకి తనంటే ఎంత ఇష్టమో!' అలా అనుకునేసరికి వాడికి అమ్మ, నాన్న, మేక గుర్తుకువచ్చేశారు. 'కానీ అక్కడికి వెళ్లటానికి ఇక వీలు లేదు. ఒకసారి ఇక్కడికి వచ్చేశాక ఇక అంతే!' దాంతో వాడికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఎంత స్వర్గంలో ఉన్నా,దిగులు మొదలైంది.

అయితే ఆ సంగతిని గమనించిందొక అప్సరస. "ఏమైంది? ఎందుకు దిగులుగా ఉన్నావు నువ్వు?" అని అడిగింది దయతో.

"అయ్యో, ఏం చెప్పేది? నాకు కూడా మీలాగే ఎప్పుడైనా భూలోకం వెళ్ళి వింతలన్నీ చూడాలని ఉంది" అన్నాడు రాము ఆమెతో.

"నీకు గుర్రంగా మారే విద్య రాదుగా, రెక్కలు కూడా లేవు. ఇక నువ్వు మాతో ఎట్లా రాగలవు?" అడిగింది ఆ అప్సరస.

"ఒక్కసారి నన్నునీ వీపు మీద ఎక్కించుకొని తీసుకు వెళ్ళొచ్చు కదా" అన్నాడు రాముడు వేడుకుంటున్నట్లు.

ఆ అప్సరసకి వాడి బాధ అర్థమైంది. "సరేలే! ఈ రోజు రాత్రి మేమందరం భూలోకానికి వెళ్తాం కదా, అప్పుడు నేను అందరికంటే చివరన బయలు దేరుతాను. మిగతా వాళ్లెవరికీ తెలీకుండా వచ్చి నా వీపుమీద కూర్చో మరి" చెప్పింది ఆ అప్సరస.

ఆ రోజు మధ్యరాత్రి వేళ అన్ని గుర్రాలు వెళ్ళిన తరువాత రాముడు ఆ అప్సరస గుర్రం మీద ఎక్కి గట్టిగా పట్టుకున్నాడు. కొద్ది క్షణాల తరువాత వాడు కళ్ళు తెరిచి చూస్తే క్రింద చెరువు కనబడింది. వెంటనే వాడు చెరువులోకి ఎగిరి దూకాడు.

ఆ నీటి శబ్దం విని అన్ని గుర్రాలు మాయం అయ్యాయి. వాడిని తీసుకొచ్చిన గుర్రం కూడా మాయం అయిపోయింది. వాడు సంతోషపడి ఆ పాడు బడిన పెంకుటింట్లో ఆ రాత్రి నిద్రపోయాడు. మరుసటి రోజు తెల్లవారిన తరువాత వాడు వాడి ఊరికి వెళ్ళొస్తూ ఎదురు వచ్చిన వారందరికీ జరిగినదంతా చెప్పాడు. వాళ్ళంతా "పోరా! పగటికలలు కనేవాడా!" అంటూ నవ్వారు.

ఒక్కడు కూడా వాడిని నమ్మలేదు.

దిగాలు ముఖం వేసుకుని ఇంటికి చేరిన వాడిని చూసిన వాడి అమ్మ " ఎక్కడికెళ్ళావురా? " అంది. " మేక ఏదిరా వెధవా! " అన్నాడు వాడి నాన్న.

" పగటి కలలు కంటూ ఆ మేకని ఆ అడవిలోనే వదిలేసి వచ్చావా? ఛో! పోయి మేకని వెతికి తీసుకురారా" అని వాడిని తొందర పెట్టాడు వాడి నాన్న.

"బిడ్డ అన్నం తిని రెండు రోజులయింది. అన్నం తిని వెళ్ళి వెతుకుతాడులే " అంటూ అమ్మ వాడిని లోపలకి తీసుకుపోయింది.

గుర్రాలు, అప్సరసలు అంతా నిజమో కలో అర్థం కాలేదు పాపం వాడికి.

మీకు అర్థం అయిందా పగటి కలలు కనకూడదని? 

చిట్టి బొమ్మ






# పావురం చెప్పిన పాఠం

*"కులాలు వేరయినా, మతాలు వేరయినా, జాతులు వేరయినా మనుషులంతా ఒక్కటే. అందరి రక్తం ఎర్రగానే ఉంటుంది. పరమత సహనం కన్నా పరమార్థం లేదని బుద్ధుడు, గాంధీజీ వంటి మహానుభావులు ఏనాడో బోధించారు. మనం ఎక్కడున్నా, ఏ మార్గాన్ని ఎన్నుకున్నా మనుషులుగా జీవించాలి; ఇతర మతాలను గౌరవించాలి; ఇతరులను ప్రేమించాలి" అని అద్భుతమైన పాఠం చెబుతున్నది, ఈ చిట్టి పావురం. చదవండి...*

*సౌజన్యం: ఎస్. ఇష, 8 వ తరగతి, బెల్ అండ్ బెన్నెట్ హైస్కూలు, రామ్ నగర్, అద్దంకి.*

అనగనగా ఒక ఊరి శివాలయంలో చాలా పావురాళ్ళుండేవి. అవన్నీ అక్కడ చాలా సంతోషంగా బ్రతికేవి. అయితే ఒకసారి ఆ గుడికి కుంభాభిషేకం చేసే సమయం దగ్గరయింది. అభిషేకం కోసం ఆలయాన్ని శుభ్రం చేయటం మొదలు పెట్టారు. చాలామంది పనివాళ్ళు వచ్చారు. బూజు దులిపే కట్టెలు, చీపుర్లు పట్టుకొని ఎక్కడెక్కడి

బూజూ దులపసాగారు; పక్షుల గూళ్ళను తొలగించటం మొదలుపెట్టారు.

పావురాళ్ళకు చాలా కష్టమైంది. వాటి గూళ్ళన్నీ పోయాయి. ఇక అక్కడ ఉండటం ఇష్టం కాలేదు వాటికి. శివాలయం ఎదురుగానే ఉన్నదొక చర్చి. పావురాళ్ళన్నీ ఇప్పుడు ఆ చర్చిలోకి వెళ్ళి నివాసం ఏర్పరచుకున్నాయి. చర్చిలోని ప్రశాంత వాతావరణం వాటికి చాలా నచ్చింది. అక్కడ వాటిని బెదిరించేవాళ్ళు, గూళ్లను చెరిపే వాళ్ళు ఎవరూ లేరు. అట్లా అవన్నీ కొంతకాలంపాటు చర్చిలో ప్రశాంతంగా జీవించాయి. అయితే అంతలోనే క్రిస్మస్ పండగ వచ్చింది. చర్చికి సున్నం కొట్టే పనులు మొదలయ్యాయి. పావురాళ్లకు మళ్ళీ కష్టకాలం వచ్చింది.

ఇప్పుడు ఎక్కడ ఉండాలో అర్థం కాలేదు వాటికి. అటూ ఇటూ చూసాయి. దగ్గర్లోనే ఉన్న మసీదు కనబడింది. ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉన్న ఆ మసీదు వాటికి అనువుగా తోచింది. ఇక ఇప్పుడు అవన్నీ వెళ్ళి మసీదును ఆశ్రయించాయి. అట్లా మరికొంత కాలం గడిచింది. అంతలోనే రంజాన్ మాసం వచ్చింది. పావురాళ్ళకు మళ్ళీఇబ్బందులు మొదలయ్యాయి. మళ్ళీ సందిగ్ధంలో పడ్డాయి. చివరకు మళ్ళీ శివాలయంలోకి వచ్చి చేరుకున్నాయి..మునుపటి లాగే జీవించసాగాయి.



అంతలోనే ఏదో కలవరం మొదలైంది. మనుష్యులు ఒకరినొకరు తుపాకులతో కాల్చుకుంటున్నారు- కత్తులతో నరుక్కుంటున్నారు! పావురాళ్ళు గూళ్ళలో నుండి బయటకు వచ్చి చూశాయి. పిల్ల పావురం ఒకటి భయంతో తన తల్లి రెక్కల

సందులోకి చేరింది. తల్లి పావురం ఒకటి తన పిల్లలకోసం వెతుక్కొని, వాటినన్నిటినీ ఒక మూలకు తరిమి, తను అడ్డంగా కూర్చున్నది.

"ఈ మనుషులకేమైంది, ఇట్లా ఒకళ్ళనొకళ్ళు కాల్చుకుంటూ నరుక్కుంటున్నారు?" అడిగిందొక చిన్నపావురం.

"ఈ గుడిలో వాళ్ళు, ఆ చర్చిలో వాళ్ళు, మసీదులోవాళ్ళు 'మేం గొప్ప' అంటే 'మేం గొప్ప' అని కొట్టుకుంటున్నారు. నిజంగా ఎవరు గొప్పో మరి?!" అన్నది వాళ్ళమ్మ.

"మరి మనం గుడిలోనూ ఉన్నాం, చర్చిలోనూ ఉన్నాం, మసీదులోనూ ఉన్నాంగా? వాళ్ళందరికంటే- మరి, మనమే గొప్ప అన్నమాట!" అన్నది చిన్నపావురం, ఆలోచిస్తున్నట్లు.

"ఔను తల్లీ! మనం అస్సలు కొట్టుకోంగా, అందుకని మనమే గొప్పవాళ్ళం" అన్నది తల్లి పావురం, దాన్ని కూడా తన రెక్కల సందులోకి నెడుతూ.



నవ్వండి!

**ఎండ-నీడ**

భార్య: జీవితాంతం మీ నీడలో బ్రతకాలని ఉంది.

ఫిజిక్సు అయ్యవారు: అంటే జీవితాంతం నేను ఎండలో నిలబడాలనా, నీ ఉద్దేశం?!

**తీపి ఎక్కువయింది!**

రాము: మొన్నటివరకూ అందరితోటీ తీయగా మాట్లాడేవాడివి, ఇప్పుడు అంత కటువుగా మాట్లాడుతున్నావెందుకు?

వెంగళప్ప: నాకు షుగర్ ఉందని తెల్సిందిరా, డాక్టరు గారు తీపికి దూరంగా ఉండామన్నారు; అందుకని!



# పొంచి ఉన్న ప్రమాదం

*"భోగ్య వస్తువుల ఆకర్షణ నిజంగా బలమైనది. మనల్ని ఆకర్షించే వస్తువులు ఎదురైనప్పుడు, ఒక్కసారి ఆగి ఆలోచించటం అవసరం" అని పెద్దలు చెప్పినట్లు చెబుతున్నది, హారిక. చదివి ఆలోచించండి, మరి!*

*సేకరణ: డి. హారిక, 10 వ తరగతి, Z.P.S.S, తరాలపల్లి, వరంగల్ జిల్లా*

ఒకసారి చిన్న పురుగు ఒకటి ఎక్కడికో పోతున్నది. దూరం నుండే దాన్ని చూసింది, ఒక కప్ప. మహా ఆనంద పడింది. "ఆహా! ఎంత చక్కటి భోజనం దొరికింది!" అని సంతోషంతో పొంగి పోయింది. పురుగును తినే ఉబలాటం కొద్దీ దాని వైపుకు పరుగెత్తింది.

సరిగ్గా అదే సమయానికి కప్పను చూసిందొక పాము. దానికి నోరూరింది. "ఎంత కాలానికి, ఇంత చక్కని కప్ప నాకు ఆహారం కాబోతున్నది!" అని మురిసి పోయింది. కప్పను మ్రింగాలనే కోరికతో దాని వెంట పడింది. అటూ ఇటూ చూడకుండా వేగంగా కప్ప వెనక బయలుదేరింది.

ఆ సమయంలో దాన్ని చూసింది, ఒక నెమలి. "ఓహో! కన్నూ మిన్నూ కానని పాము ఇప్పుడు నా కంట పడింది- ఇక కొద్ది సేపట్లో నాకు ఆహారం కానున్నది- తప్పదు" అని పాము వైపుకు దూకబోయింది.

అంతలోనే అది ఒక పులి కంట పడింది. "ఎంత ధైర్యం, ఈ నెమలి నన్ను గమనించనైనా గమనించలేదు. దీనికి కాలం చెల్లింది. నాకు ఆహారం అవ్వనున్నది" అని నెమలిమీదికి దూకేందుకు సిద్ధపడింది.

అదే సమయానికి బోయవాడొకడు పులిని చూసి, దాన్ని వేటాడే ఉద్దేశంతో ధనుర్బాణాలు తీసుకొని పరుగున వచ్చాడక్కడికి.

అట్లా ప్రాణులన్నీ తమ ముందున్న ఆహారాన్ని చూస్తూ మురిసి పోతున్నాయి తప్పిస్తే, తమ వెనుక పొంచి ఉన్న ప్రమాదాన్ని గమనించటమే లేదు, దాన్ని గురించి ఏమాత్రం ఆలోచించటమే లేదు!

నవ్వండి!

**కుక్క!**

అప్పారావు: మీ హోటల్లో కుక్కలకి భోజనం పెడతారా?

సర్వర్: మాకు అట్లాంటి పట్టింపులేమీ లేవు- రండి కూర్చోండి. భోజనం తయారుగా ఉంది!

**నాటకం!**

స్వామి: ఈ ప్రపంచం అంతా రంగస్థలం నాయనా!

శిష్యుడు: మరి నాటకానికి టిక్కెట్లు ఎక్కడ దొరుకుతాయి స్వామీ?!

**ప్లీజ్!కాదనకు!**

అమ్మ: చలిగా ఉంది కదా, ఐస్క్రీం తినకు!

రవి: స్వెటర్ వేసుకొని తింటానులేమ్మా!



# తోటమాలి తెలివి

*"విజ్ఞానం ఒకరి సొత్తు కాదు" అంటూ భావన రాసి పంపిన ఈ కథని కొంచెం సవరించి ప్రచురిస్తున్నది కొత్తపల్లి. చదివి ఎలా ఉందో చెప్పండి. మీకు వీలైతే మీరూ ఈ పని చేసి చూడండి.*
*సేకరణ: ఎస్. భావన, 7 వ తరగతి, బెల్& బెన్నెట్ హైస్కూలు, రామ్ నగర్, అద్దంకి కథనం: కొత్తపల్లి.*

విజ్ఞాన వర్మ మహారాజు గారికి కళలంటే చాలా గౌరవం. వివిధ శాస్త్రాలతో బాటు రకరకాల విద్యలనుకూడా ఆదరించేవాడాయన. ఆయన ఆస్థానంలో కళాకారులకు, పండితులకు ఇరువురికీ ప్రాధాన్యత ఉండేది.

ఒకసారి పొరుగురాజ్యం నుండి కళాకారుడొకడు రాజుగారి ఆస్థానానికి వచ్చాడు. మైనంతో చేసిన మొక్కనొకదాన్ని తీసుకొని వచ్చాడతను. సహజంగా ఉండే మొక్కకు ఏమాత్రం తీసిపోకుండా అద్భుతమైన నైపుణ్యంతో రూపొందిందామొక్క. పొరుగు దేశపు

కళాకారుడు ఆ మొక్కతో పాటు ఒక నిజమైన మొక్కను కూడా తెచ్చాడు. రెండింటినీ వేరు వేరు మట్టి కుండల్లో పెట్టాడు. రెండింటినీ ఒక చోటికి చేర్చాడు.

"మహారాజా! ఈ రెండు మొక్కల్లో ఒకటి భగవంతుని సృష్టి; ఒకటి నా సృష్టి. నా సృష్టి భగవంతుని సృష్టికి ఏమాత్రం తీసిపోదనే నా నమ్మకం. దీనికి మీరు, మీ రాజ్యంలోని పండితులు, పామరులు అందరూ సాక్షులవ్వాలని నా కోరిక. మీ రాజ్య ప్రజల్లో ఎవరైనా ఈ రెండు మొక్కల్లో ఏది మైనపు బొమ్మో, ఏది అసలు మొక్కో కనుగొనగలరేమో చూడండి. మొక్కలను ముట్టుకోరాదు; తెంపరాదు. నేను ఈ మొక్కలను ఇప్పటికే అనేక దేశాల్లో ప్రదర్శించి ఉన్నాను. ఎక్కడా, ఎవ్వరూ అసలు మొక్కను గుర్తించలేకపోయారు. మీ ప్రజల తెలివితేటలకు ఇది ఒక పరీక్ష అనుకోండి. అసలు మొక్కను గుర్తించమనండి" అన్నాడతను, రాజుతో.

రాజుగారు రెండు మొక్కల్నీ పరీక్షగా చూశారు. రెండూ సహజంగానే ఉన్నాయి. రెండూ గాలికి అల్లల్లాడుతున్నాయి. రాజుగారు తమ వృక్ష శాస్త్రజ్ఞులకు, రసాయన శాస్త్రజ్ఞులకు, ఉద్యానవనాధికారులకు అవకాశం ఇచ్చారు. ఆ రెండు మొక్కల్లో ఏది అసలో, ఏది నకలో ఎవ్వరూ గుర్తించలేకపోయారు.



శాస్త్రవేత్తల తర్వాత సభలో ఉన్న పెద్ద పెద్ద అధికారులందరికీ అవకాశం వచ్చింది. అందరూ శ్రద్ధగా చూసేవాళ్ళే; అందరూ పెదవి విరిచేవాళ్ళే. ఎవ్వరూ అసలు మొక్కను గుర్తించలేకపోయారు.

రాజుగారు ఓటమిని అంగీకరించబోయారు.

ఆ సమయంలో ముందుకొచ్చాడు ఒక తోటమాలి. "అసలు మొక్క ఏదో నేను గుర్తించి చెబుతాను మహారాజా!" అన్నాడు.

సభికులందరూ నవ్వారు. "గొప్ప గొప్ప వాళ్ళే ఏమీ చెప్పలేక పోయారు, నువ్వేం చెప్తావులే" అని అతన్ని ఎగతాళి చేసారు.

"ఈ మొక్కల్ని ఉన్నవాటిని ఉన్నట్లు కప్పేసేంత పెద్ద గాజు పాత్రలు రెండు తెప్పించండి మహారాజా!" అన్నాడు తోటమాలి.

సభంతా నిశ్శబ్దం అయింది. 'ఇతను ఏదో చేసి చూపెడతాడు' అనిపించిందందరికీ.

రాజుగారు రెండు గాజు కుప్పెలు- పెద్ద పెద్దవి- తెప్పించారు.

వాటిని రెండు కుండీలమీదా బోర్లించాడు తోటమాలి.

ఐదు నిముషాల్లో తేడా తెలిసిపోయింది. ఒక గాజు కుప్పె మసకబారింది. అసలు మొక్క శ్వాసిస్తూ వదిలిన నీటి ఆవిరి, ఆ గాజు కుప్పెలో ద్రవీభవించింది. మైనపు మొక్కను కప్పిన గాజు పాత్ర మటుకు ఉన్నదున్నట్లు ఉండిపోయింది.

సభంతా హర్షధ్వానాలతో నిండింది. పొరుగు దేశపు కళాకారుడు తోటమాలిని అభినందించాడు. విజ్ఞాన వర్మ తన మెడలో ఉన్న రత్న హారాన్ని తోటమాలి మెడలో వేసాడు.

తోటమాలి మటుకు పాత్ర నిండుగా నీళ్ళు తెచ్చి నిజం మొక్కకు పోసాడు!

**నిద్ర మత్తు!**

నవ్వు!

డాక్టరు: రోజూ నిద్ర లేచిన తర్వాత ఒక మాత్ర వేసుకోండి.

పేషంటు: నిద్రలేచాక ప్రతిసారీ వేసుకోవాల్సిందేనా, సార్?

డాక్టరు: అదేం ప్రశ్న?!

పేషంటు: మీరిచ్చిన మాత్రలు తింటే ఎప్పుడూ మత్తుగానే ఉంటోంది మరి- రోజూ పదిసార్లు నిద్రపోతున్నాను, పదిసార్లు లేస్తున్నాను!

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: కొత్తపల్లి*

ఈ బొమ్మను చూడండి:



మీరంతా కలిసి ఏదో పాడు పడిన కోటకు వెళ్ళారు. అప్పుడు మీకు చాలా భయం వేసింది కూడా. అయితే చివరికి మీకు ఏదో దొరికినట్లుంది కదూ, ఆ కథని రాసి పంపండి మాకు! బాగుంటే కొత్తపల్లి-62 లో ప్రచురిద్దాం!

మా చిరునామా తెలుసుగా? కొత్తపల్లి, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101 ఫోను: 08559240222, 7702877670, ఇ-మెయిలు: team@kottapalli.in

# రాజు బడికి వెళ్ళాడు!

'అందరూ చదువుకోవాలి ' అంటూ తను తయారు చేసిన ఈ బొమ్మల కథని మనతో పంచుకుంటున్నాడు రాము. చూసి ఎలా ఉందో చెప్పండి. మీరూ బొమ్మలు వేసేందుకు ప్రయత్నించండి!
రచన, చిత్రాలు: అడవి రాముడు, కొత్తపల్లి బృందం.

రాజు శివ ఇద్దరూ మంచి స్నేహితులు.





రాజు వాళ్ళ అమ్మ నాన్నలు ఇద్దరూ కూరగాయల వ్యాపారం చేస్తున్నారు. వాళ్ళ వ్యాపారం చిన్నదే అయినా, వాళ్ళ కుటుంబ అవసరాలకి సరిపోయేది.

అయితే అకస్మాత్తుగా రాజు వాళ్ల అమ్మానాన్నలు ఓ ప్రమాదంలో చనిపోయారు.

రాజుకి ఇక నా అన్నవాళ్ళెవ్వరూ లేకుండా అయ్యింది. మరి వాడు బ్రతికేదెలాగ? ఓ టీ కొట్టులో పనికి కుదురుకున్నాడు రాజు.





వాడి కోసం వెతుక్కుంటూ వచ్చాడు శివ. 'చదువుకోకపోతే ఎలారా?' అని వాడు రాజుని ప్రభుత్వం నడిపే బాల కార్మికుల పాఠశాలకు తీసుకెళ్ళాడు. అక్కడ పిల్లలకోసం ఓ హాస్టలు కూడా ఉంది.



పిల్లలిద్దరూ అక్కడి హెడ్మాస్టరు గారితో మాట్లాడారు. రాజు గురించి తెలుసుకున్న హెడ్మాస్టరుగారు వాడిని వెంటనే బడిలో చేర్చుకున్నారు. హాస్టలులో సీటు ఇప్పించారు కూడాను.



ఇప్పుడు రాజు మళ్ళీ చదువుకుంటున్నాడు. సంతోషంగా ఎదుగుతున్నాడు. పెద్దయ్యాక దేశానికి పనికొచ్చే పని ఏదైనా చేయాలనుకుంటున్నాడు.

పిల్లలందరూ చదువుకోవాలి. చదువుకోవటం మన హక్కు!



# విధి వ్రాత

రూమీ చెప్పిన కథ

పున: కథనం- కొత్తపల్లి

సాలమన్ చక్రవర్తి చాలా గొప్పవాడు. ఆయనకు అనేక అద్భుత శక్తులు ఉండేవి. ఆయన దేవతలతో రోజూ మాట్లాడుతుంటాడనీ, ఎక్కడికంటే అక్కడికి ఎగిరి పోగలడనీ, ప్రజలు చెప్పుకునేవాళ్ళు.

ఒకసారి ఒక నడివయసు వ్యక్తి సాలమన్‌గారి దర్బారులోకి వచ్చి తటాలున ఆయన పాదాలమీద పడి, 'కాపాడండి! కాపాడండి!' అని ఏడవటం మొదలుపెట్టాడు.



'ఏమైంది, నీకు? ఎవరినుండి భయం?' అడిగాడు సాలమన్, అతన్ని లేవనెత్తుతూ.

'మహాప్రభూ! ఇవాళ్ళ నాకు మృత్యుదేవుడు దర్శనమిచ్చాడు. అతన్ని చూడగానే నాకు అర్థమైపోయింది- అతను నా ప్రాణాలు హరించేందుకే వచ్చాడని. అతను నన్ను చూసి- నా కళ్ళలోకే చూస్తూ- ఒకలాగా నవ్వాడు. ఆ నవ్వులోని క్రూరత్వం నన్ను ఎంతగా భయపెట్టిందో చెప్పలేను. నా మరణ ఘడియలు దగ్గర పడ్డాయని నాకు అర్థం అయ్యింది. ప్రభూ! నన్ను కాపాడండి!' అని చెబుతూ బిగ్గరగా ఏడ్చాడతను.

'ఊరుకో, నేను ఏం చెయ్యాలో చెప్పు. నీకు ఏ సాయం కావాలంటే ఆ సాయం చేస్తాను' అన్నాడు సాలమన్ చక్రవర్తి, దయతో కరిగిపోయి.

'ప్రభూ, తమరికున్న అద్భుత శక్తితో తక్షణం నన్ను ఇక్కడినుండి దూరంగా పంపించేయండి. పురుగు కూడా చొరలేని ఏవైనా సుదూర తీరాలకు- ఏ భారతదేశపు దట్టమైన అడవుల్లో మారుమూలకో పంపించేయండి. ఇట్లా ఇంతమంది మధ్య కాక, ఎవరూ లేని మూలన తలదాచుకుంటాను. ఈ మృత్యు ఘడియలు ఐపోయేంతవరకూ దైవ ప్రార్థన చేసుకుంటాను. ఆపై తమరి దయ!' అన్నాడా వ్యక్తి, వణికే గొంతుతో.



'సరేలే, దానిదేముంది, అలాగే చేద్దాం' అన్నాడు సాలమన్ చక్రవర్తి. ఎగిరే తివాచీని రప్పించాడు. 'ఈ మనిషిని సత్వరం భారతదేశం చేర్చు. అక్కడ అతను ఏ మూలన కోరుకుంటే ఆ మూలన వదిలిపెట్టి రా' అని ఆజ్ఞాపించాడు దాన్ని.

నడివయసాయన ప్రభువుకు నమస్కరించి ఎక్కి కూర్చోగానే, తివాచీ వేగంగా ఆకాశంలోకి ఎగిరి భారతదేశం వైపు ప్రయాణించింది. దాని వేగానికి గాలి కూడా తల వంచింది. దిక్కులు అన్నీ ఏకమై ఆశ్చర్యంగా చూశాయి.

కొద్ది సేపట్లోనే తివాచీ భారతదేశం చేరుకున్నది. అది ఓ దట్టమైన అడవిలో వాలదామనుకునే సరికి, దాని ముందు ప్రత్యక్షమయ్యాడు మృత్యువు: 'వచ్చావా, రాలేవేమో అనుకున్నాను- రా, రా!' అంటూ.



మృత్యువుని చూసేసరికే నడివయసు మనిషి ఒళ్ళు చల్లబడ్డది. భయంతో అతని గుండె ఆగిపోయింది. అతని శరీరం తివాచీ మీదినుండి ఆ అడవిలోకి దబ్బున జారి పడిపోయింది.

తివాచీ ద్వారా విషయం తెలుసుకున్న సాలమన్ చక్రవర్తి మృత్యుదేవుడితోమాట్లాడాడు-

'ఎందుకయ్యా, నిన్న ఆ మనిషిని అంతగా భయపెట్టాల్సిన అవసరం ఏమొచ్చింది?' అని అడిగాడు.

'అయ్యో, నేను కావాలని ఏమీ చెయ్యలేదు' అన్నాడు మృత్యుదేవుడు.

'అదేమి మాట! నిన్న నువ్వు అతన్ని చూసి వికటంగానవ్వావట!' అడిగాడు సాలమన్.

'ప్రభూ! తమరు అడిగాడు కాబట్టి చెబుతున్నాను. 'ఆ మనిషి ప్రాణాలను ఇవాల్టి ఉదయం పదిగంటలకల్లా, భారతదేశం పడమటి కనుమల్లో హరించు' అని నాకు విధి ఆదేశం. అయితే, నిన్న సాయంత్రం చూస్తే అతను ఇంకా ఇక్కడే ఉన్నాడు- 'ఎక్కడి భారత దేశం, ఎక్కడి కాబూల్?! ఇతను అక్కడికి ఎలా చేరుకుంటాడు, అదీ

రేపట్లోగా? అసంభవం! ఎందుచేతనో విధి తప్పింది, ఇన్నాళ్లకు!



మరి నేను ఇప్పుడు ఏం చేయాలి? ఇతన్ని వదిలేయాలి..' అనిపించి, నా అసమర్థతకు నేనే నవ్వుకున్నాను'-

'అయితే తమరి చలవ వల్ల అతను నిర్దేశించిన సమయానికి సరిగ్గా భారతదేశపు పడమటి కనుమలు చేరుకునేశాడు! దాంతో నేను నా విధిని నిర్వర్తించాను- ఏం చేసేది, విధి బలీయం!" అన్నాడు సంజాయిషీ ఇస్తున్నట్లు.

'విధి రాతను తప్పించటం తన వల్ల కూడాకాలేదు' అని గ్రహించి మళ్ళీ ఓమాటు ఆశ్చర్యపోయాడు సాలమన్ చక్రవర్తి. ✷

నవ్వండి!

**టింగ్లీష్!**

టీచర్: రాముూ! మీ నాన్నగారి పేరును రాయమంటే 'Temple steps water king' అని రాశావేమిటి, తిక్కనా?!

రాము: మరి మా నాన్నగారిపేరు 'గుడిమెట్ల గంగరాజు' టీచర్!

**గోడ కుర్చీ!**

టీచర్: సోమూ, నా కుర్చీ పట్టుకెళ్తున్నావెందుకు?

సోము: మీరేకద టీచర్, గోడకి కుర్చీ వేయమన్నారు?!



# రాజకుమారుడి సౌందర్యం

*బాగా పేరొందిన ఆంగ్ల కథల్లో ఒకటి, ఇది. శరీర సౌందర్యం బయటికి కనిపిస్తుంటుందేమో గాని, నిజానికి అది శాశ్వతంగా ఉండేది కాదు. మనసు శుభ్రంగా ఉంటే అదే పదివేలు.*
*అనువాదం: శ్రీ పి.వి.ప్రసాద్, విజయవాడ.*

అనగనగా ఒక యువరాజు. ఆ రాజు ఎంతసేపూ తన అందాన్ని చూచుకొని మురిసి మైమరచి పోతుండేవాడు.

ఎవరైనా బాటసారులు రాజభవనానికి వస్తే "మీరెప్పుడైనా నా అంత సౌందర్య వంతుణ్ణి చూశారా?" అని వాళ్ళనడిగేవాడు.

'లేదు'అనే చెప్పేవాళ్ళు అందరూ . ఒక రోజు దర్శనాని కొచ్చిన ఓ నీచ బాటసారైతే "దేవుడు కూడా మీ అంత అందంగా వుంటాడని నేననుకోను..!" అంటూ అతిగా పొగిడాడు. దాంతో పొంగిపోయిన యువరాజు "దేవతలకంటే కూడా నేనే సౌందర్యవంతుడ్ని.." అంటూ మరింత

గొప్పగా చెప్పుకునేవాడు.

అలా రోజులు గడుస్తున్నాయి. ఒకరోజు ఇద్దరు దర్శకులు తాముదైవస్వరూపులమని చెప్పుకుని యువరాజు దర్శనానికి వచ్చారు.

"మీరు చెప్పుకుంటున్నంత సౌందర్య వంతులో-కాదో..!? చూద్దామని వచ్చాం.." వివరించారు.

"నేను కాదా!?" ఆశ్చర్యంగా అడిగాడు రాజు.



"మిమ్మల్ని ఈ రోజు ఉదయం నిద్రిస్తుండగా చూశాం. అప్పుడు ఇంకా అందంగా వున్నారు " ఒక దేవదూత చెప్పాడు.

"నా సౌందర్యం అప్పుడే- కొన్ని గంటల్లోనే ఎలా తగ్గిపోయింది?" అంటూ సేవకుల్ని పిలిచి "నేను ఉదయం ఇప్పటికంటే ఎక్కువ అందంగా వున్నానా?" ఆరా తీసాడు యువరాజు.

"మీరు అప్పుడూ-ఇప్పుడూ ఒకేలా వున్నారు" అని జవాబిచ్చారు సేవకులు.

"మేము దైవ స్వరూపులం. మీ సేవకులు చూడలేని వాటిని కూడా మేము చూడగలం. వాళ్ళ దృష్టి అసంపూర్ణం, కనుక వాళ్ళు చెప్పింది నిజం కాదు. ఆ విషయం మీకు రుజువు చేస్తాం..." అంటూ ఒక దేవదూత ఒక పాత్రలో నీళ్ళు తెప్పించమని అడిగాడు యువరాజును.

యువరాజు వెంటనే సేవకుల చేత ఒక పాత్రలో నీళ్ళు తెప్పించాడు.

దేవదూత సేవకుల్ని పిలిచి "పాత్రలోని నీటిని మీరు దగ్గరగా పరిశీలించండి. ఆ తరువాత గది బయటకి వెళ్ళండి" అని చెప్పాడు. అలాగే సేవకులు పాత్రలోని నీటిని పరిశీలించి, బయటికి వెళ్ళారు.

అప్పుడు ఆ దేవదూత పాత్రలోంచి ఒక

అరచెంచా నీటిని తీసివేశాడు. మళ్ళీ సేవకుల్ని లోపలికి పిలిచి "పాత్రలోని నీటి మొత్తంలో ఏమైనా తేడా ఉందా?" అడిగాడు.

"ఏమీ లేదు" జవాబిచ్చారు సేవకులు.

"చూశారా?! పాత్రలో నీళ్ళు తగ్గిన సంగతిని మీ సేవకులు గమనించనే లేకపోయారు?! మీ అందం తగ్గిన సంగతి ఎలా గమనించలేదో ఇదీ అంతే..." దేవదూత అన్నాడు యువరాజుతో.

యువరాజు కంపించిపోయాడు. 'నా అందం రోజురోజుకి తరిగిపోతోందన్న మాట! అయినా వీళ్ళెవ్వరూ దాన్ని గుర్తించటం లేదన్నమాట! అయ్యో!' అని బాధ పడ్డాడు.

'ఎప్పుడూ తరిగిపోయే దాని పట్ల అంత వ్యామోహం ఎందుకు?' అడిగి మాయమైపోయారు దేవదూతలు.

'అవును, ఎప్పుడూ తరిగిపోయే అందం గురించి నేనెందుకు అంతగా వ్యామోహపడాలి? అశాశ్వతమైన ఈ దేహ సౌందర్యాన్ని గురించి అంత చింత ఎందుకు?' ఆలోచనలో పడ్డాడు యువరాజు.

అటు తర్వాత ఆయనకు అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నప్పుడు మరీ ఇష్టంగా ఏమీ అనిపించలేదు. 'మారిపోయే శరీరం కదా, ఇది!?' అనిపించసాగింది.

కాలక్రమేణా తను పూర్తిగా మార్పుచెందాడట- బాహ్య సౌందర్యానికి ప్రాధాన్యతనివ్వటం మానేసి, తన మనసును శుభ్రం చేసుకునే పనిలో పడ్డాడట.

**నవ్వండి!**

**స్పెషల్!**

వెంగళప్ప: నేను హైదరాబాదులో స్పెషల్ దోసె తిన్నాను తెలుసా?!

సురేష్: అవునా?! ఎలా ఉంది అది?

వెంగళప్ప: గుండ్రగా!



# రక్తం తాగే దేవత

*రచన: ఎస్. శంకరశివ రావు, ఉపాధ్యాయులు- ఇంద్రజాలికులు- జన విజ్ఞాన వేదిక రాష్ట్ర సచివులు.*

ధర్మవరం మండలం నడిమిగడ్డపల్లి గ్రామం. చుట్టూతా కొండలు-మధ్యలో ఉంది ఆ పల్లె. ప్రతి ఒక్కరి చేతిలోనూ సెల్ ఫోనులు ఉన్నాయి. అయినా ఎక్కడ వేప చెట్టు ఉంటే అక్కడ ఒక దేవత ప్రతిష్ఠించబడి ఉంది. వానాకాలం, అంటువ్యాధుల సీజన్ మొదలైంది. చికన్ గున్యా, వైరల్ ఫీవర్లు ప్రబలి ఉన్నాయి. పల్లె ప్రజల్లో నమ్మకాలు ఎక్కువ. డాక్టర్ల కంటే మంత్రాలను తంత్రాలను ఎక్కువ నమ్ముతారు. జబ్బు బాగా ముదిరిన తరువాతనే డాక్టరు దగ్గరికి వెళ్తారు.

బలరాముడు, బాలమ్మలకు ఒక్కడే సంతానం. కొడుకు పేరు ప్రసాదు. ప్రసాదు మామూలుగా చాలా చలాకీగా ఉంటాడు. వారం రోజుల నుండి జ్వరం, కీళ్ళ నొప్పులు, వాంతులతో బాధ పడుతున్నాడు. బడికి

పోవడం మానేశాడు. రకరకాల నాటు వైద్యం, మంత్రాలు, యంత్రాలు వేయించారు. అయినా జబ్బు నయం కాలేదు. గుండు రాయిలా ఉన్న పిల్లవాడు సన్నగా పీనుగులాగా తయారయ్యాడు.



బలరాముడు, బాలమ్మ దిగులుగా కూర్చుని వున్నారు అరుగుమీద. అదే దారిన వెళుతున్నాడు యంత్రాలు కట్టే ఎర్రిస్వామి. బలరాముడిని చూసి "ఏం రాముడూ, అంతా బాగున్నారా?" అడిగాడు .

"ఏం బాగులే అన్నయ్యా!" అన్నది బాలమ్మ నీరసంగా.

"ఏమైంది తల్లీ, బిడ్డకు? పీలగా అయిపోయినాడు?" నిలబడి అడిగాడు ఎర్రిస్వామి, ప్రసాద్ ను పరీక్షగా చూస్తూ. "చాలా ఆలస్యం అయిందే. బిడ్డకు రక్తం లేకుండా పోయింది. రక్తం అంతా బాటమ్మ తల్లి తాగేసింది!" అన్నాడు.

"ఏంటి సామీ, మీరనేది?!" పలికారు ఆ దంపతులు.

"మీ బిడ్డకు ఏ జబ్బూ లేదు తల్లీ! రోగం లేదు-రొష్టూ లేదు! అంతా ఆ తల్లి లీల. రేపే అమావాస్య! ఆ తల్లికి శాంతి చేయాలి. నీ బిడ్డ రక్తం మళ్ళీవచ్చేలా చేస్తాను!" అన్నాడు ఎర్రిస్వామి కళ్ళు మూసుకొని.

"అన్ని వైద్యాలు అయ్యాయి సామీ! ఇక మిగిలింది నువ్వూ- ఆ బాటమ్మ తల్లే! కానీయండి" అన్నారు దంపతులిద్దరూ.

మరునాడు బలరాముడి ఇంటికి వచ్చాడు ఎర్రిస్వామి. ఇంటి మధ్యలో ముగ్గు వేశాడు. సంచిలో నుండి పళ్ళెం, చెంబు తీశాడు. "బాటమ్మ దేవతకు ఈ పళ్ళెంలోనే రక్తం తాగిస్తాను. ఇక ఆ తర్వాత ఆ తల్లి నీ బిడ్డకు

రక్తం పోస్తుంది" అంటూ పళ్ళాన్ని ముగ్గు మధ్యన ఉంచాడు.

"ఈ చెంబులో లోటాడు నీళ్ళు పోయి బలరాముడూ" అన్నాడు.

బాలమ్మ నీళ్ళు తెచ్చిస్తే, బలరాముడు వాటిని ఎర్రిస్వామికి అందించాడు భక్తిగా కూర్చొని.

ఎర్రిస్వామి చెంబు మీద వేపాకులు మూసి పెట్టి ఏవో మంత్రాలు చదువుతూ కలిపాడు.

ఆకులు తీసి చూసేసరికి చెంబులోని నీళ్ళు ఎర్రగా మారిపోయి ఉన్నాయి!

"బాటమ్మ తల్లి మహిమను చూస్తిరా? నీళ్ళని రక్తంగా మార్చే ఆ తల్లి, నీ బిడ్డకు రక్తం పోయలేదా?" అడిగాడు ఎర్రిస్వామి.

"అవును సామీ! తప్పకుండా పోస్తుంది" అన్నారు దంపతులిద్దరూ, భయభక్తులతో.

"నిజంగా ఆ తల్లికి కోపం వచ్చింది. ఆమె రక్తం తాగబట్టే మన బిడ్డ పీనుగులాగా తయారయ్యాడు!" బలరాముడు భార్యతో అన్నాడు గుసగుసగా.

ఆలోగా ఎర్రిస్వామి చెంబులోని ఎర్ర నీళ్లను పళ్ళెంలో పోసి, ఆ పళ్ళెంలో దీపాన్ని వెలిగించాడు.



దీపపు వెలుగులో ఎర్ర నీళ్లు రక్తాన్ని గుర్తుకు తెస్తున్నాయి దంపతులిద్దరికీ. ఎర్రిస్వామి గడగడా ఏవో మంత్రాలు చదువుతూ ఆపాడు-

"జాగ్రత్తగా గమనించండి. బాటమ్మ తల్లి ఈ రక్తాన్ని తాగేస్తుంది!" అంటూ వెలుగుతున్న దీపం పైన చెంబును బోర్లించాడు.

మరుక్షణంలో సర్రున శబ్దం చేస్తూ పళ్ళెంలో ఉన్న ఎర్ర నీళ్లన్నిటినీ చెంబు తాగేసింది!

నిశ్చేష్టులైపోయారు బలరాముడు, బాలమ్మ.

చెంబుని, పళ్ళేన్ని తీసుకుని దూరంగా చెట్ల

మధ్యకు పోయాడు ఎర్రిస్వామి.

తిరిగి వచ్చాక చెప్పాడు "ఇక నీ బిడ్డకు ఏ ప్రమాదం లేదు. ఒక వారం రోజులు బిడ్డను ఎండలోకి పంపకండి. బయటికి రాకుండాచూసుకోండి" అని. వద్దు వద్దంటూనే బలరాముడి దగ్గర పెద్ద మొత్తంలో డబ్బులు తీసుకుని వెళ్ళాడు కూడా.

ఆ సరికి నెల రోజులు అయ్యింది ప్రసాద్ పాఠశాలకు రాక. ఉపాధ్యాయుడు వన్నప్ప ప్రసాదును వెతుక్కుంటూ వచ్చాడు. 'ప్రసాద్! ప్రసాద్!' అని పిలిచాడు.

'రండి సారూ! నా బిడ్డకు ఆరోగ్యం బాగా లేదు. అందుకు బడికి పంపలేదు' చెప్పింది బాలమ్మ.

'ఏమయింది?' అడిగాడు వన్నప్ప టీచర్.

'బాటమ్మ దేవతకు కోపం వచ్చింది. అందుకు బిడ్డ మెత్తపడినాడు!' చెప్పాడు బలరాముడు.

'డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళారా?' అడిగాడు వన్నప్ప అనుమానంగా.

'పూజ చేసి, దోషం లేకుండాచేసినాడు ఎర్రి సామి. వారం రోజుల్లో తగ్గిపోతుంది; అప్పుడు బడికి పంపుతాము సారు!' చెప్పింది బాలమ్మ.

వీళ్ళ మూఢ నమ్మకం అర్థం అయింది వన్నప్ప టీచరుకు. 'ఏం పూజ చేశాడు?' అడిగాడు.

'అదా! అదా!' గుటకలు మింగాడు బలరాముడు.

'ఏం ఫరవాలేదు, చెప్పండి. నేను కూడా తెలుసుకోవాలి కదా!' అన్నాడు వన్నప్ప.

పూజా విధానం మొత్తం వివరంగా చెప్పింది బాలమ్మ.

'అయ్యో, తల్లీ! ఆ మాత్రం చేయటం నాకూ వచ్చు- రేయ్! శివా! ఒక పళ్ళెం చెంబు తీసుకురా! అట్లాగే ఇంకొక పని చేయి. బడిలోకెళ్ళి ఆంజనేయ సారుతో అడిగి పొటాషియం పర్మాంగనేట్ తీసుకుని తొందరగా రా" అరిచాడు వన్నప్ప.

పళ్ళెం, చెంబు, పొటాషియం పర్మాంగనేటు పలుకులు- వచ్చాయి ఐదు నిముషాల్లో.

పళ్ళెంలో నీళ్ళు పోసాడు వన్నప్ప. "ఈ

పళ్ళెంలో నీళ్ళు పోసి మధ్యలో దీపం వెలిగించండి" అన్నాడు.

"సార్! ఎర్రిసామి నీళ్ళను రక్తంగా మార్చాడు" చెప్పాడు బలరాముడు.



"తొందరపడద్దు! నేను కూడా నీళ్ళను రక్తంగా మారుస్తాను చూడండి" అంటూ ఆ నీళ్లమీద చేతులు తిప్పుతూ పొటాషియం పర్మాంగనేటు పలుకులను పళ్ళెంలోకి వదిలాడు వన్నప్ప. చూస్తూండగానే అవి కరిగి, నీళ్ళు ఎర్రగా మారాయి.

'ఇవి నీళ్ళే, రక్తం కాదు- ఏమంటే ఇవి పొటాషియం పర్మాంగనేటు కలిసిన నీళ్ళు!' అన్నాడు వన్నప్ప, ఆ నీళ్లతో నిండిన పళ్ళెంలో దీపంవెలిగిస్తూ.

బలరాముడు, బాలమ్మ అందరూనోళ్ళు వెళ్లబెట్టి చూశారు.

'ఇదిగో, శివా! ఈ దీపం మీద చెంబును బోర్లించు జాగ్రత్తగా!' అన్నాడు వన్నప్ప. శివ ముందుకొచ్చి చెంబును దీపం మీద బోర్లించాడు.

అందరు చూస్తుండగానే "సర్రున" శబ్దం చేస్తూ పళ్ళెంలోని నీళ్లు కాస్తా చెంబులోకి వెళ్ళిపోయాయి. జనాలు చప్పట్లు చరిచారు.

'ఇదే, ఎర్రిసామి చేసిన మంత్రం. అందరూ అర్థం చేసుకోండి- వెలుగుతున్న దీపం తన చుట్టూ గాలిలో ఉన్న ఆక్సిజన్‌ను వాడుకుంటుంది. మనం దీపం మీద చెంబును బోర్లించేసరికి, ఆ చెంబులో ఉన్న గాలిలోంచి ఆక్సిజన్ తగ్గిపోతుంది కదా, అందుకని చెంబులో అల్ప పీడనం ఏర్పడుతుంది. అందువల్ల చెంబుచుట్టూ ఉన్న నీళ్ళు గబగబా చెంబులోకి చేరుకుంటాయి; పీడనం మళ్ళీ

మామూలుగా అయిపోతుంది. ఇందులో ఉన్నది శాస్త్రమే తల్లీ, మంత్రం ఏమీ లేదు. చుట్టూ ఉన్నవి రంగునీళ్లయినా, మామూలు నీళ్లయినా- ఏవైనా సరే, అన్నీ చెంబులోకి పోతాయి; ఏమంటే నీళ్ళు మరీఎక్కువ కాకుండా ఉంటే సరి' వివరించాడు వన్నప్ప.

బలరాముడు, బాలమ్మలకు నోట మాట రాలేదు.

'ప్రసాదును బయటకి తీసుకు రండి' చెప్పాడు వన్నప్ప. ప్రసాదు మెడనిండా తాయత్తులు, దారాలు, గుడ్డ పేలికలు కట్టివున్నాయి. వాడి పరిస్థితి చూసే సరికి వన్నప్పకు కోపంతో రక్తం మరిగినట్లయింది. 'మీరు తొందరగా పట్నం డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళకపోతే మీ బిడ్డ మీకు శాశ్వతంగా దూరం అయిపోతాడు. బయలుదేరండి ఇప్పుడే' అరిచాడు ఆవేశంగా.

ప్రసాదు తల్లిదండ్రులకు ఇక కాదనేందుకేమీ లేకపోయింది. వాడిని తీసుకొని గబుక్కున ఆటో ఎక్కి ధర్మవరం బయలుదేరారు, డాక్టరు దగ్గరికి.

వారం తరువాత మంచి ఆరోగ్యంతో బడికి వచ్చాడు ప్రసాద్. ఇప్పుడు వాడి మెడ చుట్టూ తాయెత్తులేవీ లేవు!



నవ్వండి!

**సకారణమే!**

టీచర్: నిన్న బడికి ఎందుకు రాలేదు?

రాజు: మా అమ్మ కొట్టింది టీచర్!

టీచర్: అవునా?! ఎందుకు కొట్టింది?

రాజు: మరి నేను బడికి వెళ్ళనన్నానుగా, అందుకని.

**సీత కష్టాలు సీతవి!**

నాన్న: మా చిన్నప్పుడు ఇళ్ళలో కరెంటు లేక వీధి దీపాల క్రింద చదువుకున్నాం తెలుసా?

చిన్న: అప్పుడు కనీసం వీధి దీపాలకన్నా కరెంటు అందేది కద నాన్నా, ఇప్పుడు అదీ ఉండట్లేదు, మేమేం చెయ్యాలి?!



# బురద

*రచన: వియోగి- "మామ్మ కథలు", సౌజన్యం: శ్రీ ఎవియం.*

రాము, సోము ఒకే తరగతిలో చదువుకుంటున్నారు. రామేమో చదువులో చురుకైనవాడు; సోముకు అన్ని తెలివితేటలు లేవు.

ఉపాధ్యాయులు, ఇంకా చూసినవాళ్ళుకూడా చాలామంది రామును మెచ్చుకునేవాళ్ళు. దాంతో రాము అంటే ఒక రకమైన ఈర్ష్య పెరగసాగింది సోములో. రామును ఎలాగైనా అభాసుపాలు చేయాలని అనిపించసాగింది వాడికి!

చివరికి ఒక రోజున వాడు ధైర్యం చేశాడు- తమ తరగతిలోనే ఉన్న వనజ పుస్తకాన్ని ఒకదాన్ని దొంగిలించాడు; ఎవరూ చూడకుండా దాన్ని రాము సంచిలోకి జారవిడిచాడు.

"నా పుస్తకంకనబడటం లేదు. ఎవరో దొంగిలించినట్లున్నారు" వనజ ఫిర్యాదు

చేసింది ఉపాధ్యాయుడికి.

"అందరి సంచులూవెతకండి, దొరుకుతుంది" సూచించాడు సోము, అమాయకంగా.

ఆ ప్రకారంగా అందరి సంచులూ వెతికారు.. వనజ పుస్తకం రాము దగ్గర బయట పడింది!



"ఛీ! నువ్వు బాగా చదువుకొని పైకి వస్తావనుకున్నాం- కానీఇట్లా దొంగతనాలు మొదలెట్టావా?" అంటూ ఉపాధ్యాయులవారు రాముకు బడిత పూజ చేశారు.

"అయ్యో, నాకేం తెలీదు-నన్ను కొట్టకండి!" అని రాము ఎంత మొత్తుకున్నా ప్రయోజనం లేకపోయింది.

సోముకు చాలా సంతోషం అనిపించింది. అయితే వాడి సంతోషం ఎక్కువకాలం నిలవలేదు. 'రాముకి ఇంకా ఏదైనా నష్టం కలిగిస్తే బాగుండు'అని ఆ క్షణం నుండే వాడి మనసు ఉవ్విళ్ళూరటం మొదలెట్టింది.

అంతలోనే రాము పుట్టిన రోజు వచ్చింది. ఆరోజున వాడు మంచి కొత్త బట్టలు ధరించి బడికి వచ్చాడు. అందరూ అతన్ని- అతని దుస్తులను మెచ్చుకునేసరికి, సోము గుండె మండినట్లయింది. ఎవరూ చూడకుండా బురద తెచ్చాడు; వెనుకనుండి రాము దుస్తులపైన చల్లాడు.

తన దుస్తులు పాడైన సంగతి తోటి పిల్లలు చెబితే తెలిసింది, రాముకి. చూసుకుంటే తెల్లటి బట్టలమీద వికారంగా ఎర్రటి బురద! వాడికి చాలా ఏడుపొచ్చింది.

"ఎవర్రా ఈపని చేసింది?" అడిగారు ఉపాధ్యాయులవారు,

అందరూ మేము చేయలేదంటే మేము చెయ్యలేదన్నారు.

ఉపాధ్యాయులవారు అందర్నీ గమనిస్తూ ఉన్నారు. ఇంతలో వనజ అయన చెవిలో ఏదో చెప్పింది. ఉపాధ్యాయులవారు సోమును దగ్గరికి పిలిచి " సోమూ! బురదచల్లింది నువ్వే కదూ?" అని అడిగారు.

"లేదండి - నేనెందుకు జల్లుతాను? రామూ నాకు మంచి మిత్రుడు" సోము బొంకాడు.

"మరి నీ చేతులు చూపించు!" అడిగారు అయ్యవారు, సోము దుస్తుల మీద ఉన్న మట్టి మరకలను గమనిస్తూ.

సోమూ చేతులు చాచాడు- చెయ్యి కొంచెం ఎర్రగా ఉంది. గోర్లలో బురద అక్కడక్కడా ఇరుక్కొని ఉంది.

"సోమూ, నిజం చెప్పు! ఈ పని చేసింది నువ్వే! నీ బట్టలమీద ఉన్న మరకలు -నీ చేతిలోని ఎర్రదనమే అందుకు సాక్ష్యం " గద్దించారు అయ్యవారు.

సోమూ ఏడుస్తూ నిజం ఒప్పుకున్నాడు.

"ఎందుకు చేశావురా, ఈ పని?"

"అందరూ నాకంటే ఎక్కువగా రాముగాడినే మెచ్చుకుంటుంటారు- అందుకని.." నిజాన్ని అంగీకరించాడు సోము.

"నా పుస్తకం దొంగిలించింది కూడా సోమే అయి ఉంటాడు" వనజ చెప్పింది.

అది కూడా ఒప్పుకున్నాడు సోము.

"చూడండి పిల్లలూ- ఒకరికి చెడు చేద్దామని ఎన్నడూ ఆలోచించకండి. 'చెడపకురా, చెడేవు' అని సామెత. ఎదుటి వ్యక్తిని ఒక చూపుడు వేలుతో నిందిస్తున్నప్పుడు, మూడు వేళ్ళు మనవైపుకు తిరిగి ఉంటై, చూశారా? ఇతరులను చెడపాలనుకున్న క్షణంలోనే మనం చెడిపోతాం, నిజానికి' అన్నారు ఉపాధ్యాయులవారు.

"అదెలాగండి?!" అడిగింది వనజ ఆశ్చర్యంగా.

"రాము మీద దొంగతనం నేరం మోపుదామనుకున్నాడు సోము. కానీ అతనికంటే ముందే ఇతను దొంగగా మారి నీ

పుస్తకాన్ని దొంగిలించాడు. ఆ తర్వాతనే గద, దాన్ని రాము సంచిలో వేసింది? రాము దొంగ అవునో కాదో గాని, ముందస్తుగా వీడే దొంగ అయిపోయాడు" చెప్పారు అయ్యవారు. "అలాగే రాము మీద బురద చల్లుదామనుకున్నాడు. వాడి మీద బురద చల్లేలోగా తన చేతులకు బురద అంటింది. అంతకంటే ముందు తన మనసుకు బురద అంటింది".

"రాము దుస్తులకు అంటిన బురద ఉతికితే పోతుంది- కానీ సోము మనసుకు అంటిన బురద ఉతికినా పోదు. అందుకనే చెప్తారు- 'చెడు వినవద్దు; చెడు కనవద్దు; చెడు అనవద్దు' అని."

సోముకు కళ్లలో నీళ్ళు తిరిగాయి. రాము చేతులు పట్టుకొని క్షమించమని కోరాడు. అతనిలో నిజంగానే పరివర్తన వచ్చింది. అటుపైన అతను అందరికీ మంచి మిత్రుడైనాడు. కొంత కాలానికి 'మంచి మిత్రులు ఎవరు?' అంటే 'రాము-సోము' అని అందరూ చెప్పుకునేట్లయింది!



విను!

మిరియగింజ చూడ మీద నల్లగనుండు
గొరికి చూడ లోన జురుకు మనును
సజ్జనులగు వారి సారమిట్లుండుర
విశ్వదాభి రామ వినురవేమ

అల్పుడెప్పుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు బల్కు జల్లగాను
కంచుమ్రోగినట్లు కనకంబు మోగునా
విశ్వదాభి రామ వినురవేమ

గంగపారునెపుడు గదలని గతితోడ
మురికివాగు పారు మ్రోతతోడ
పెద్దపిన్నతనము పేర్మి యీలాగురా
విశ్వదాభి రామ వినురవేమ

మృగ మదంబు జూడ మీద నల్లగనుండు
బరిఢవిల్లు దాని పరిమళంబు
గురువులైనవారి గుణములీలాగురా
విశ్వదాభి రామ వినురవేమ

# చిలిపి ప్రశ్నలు-తిక్క జవాబులు

*నిర్వహణ: శ్రీ వి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ.*

1. తాజ్‌మహల్ ఎక్కడ ఉంది?

జవాబు: కట్టిన చోటే!

2. చలికాలంలో ఐస్‌క్రీం తింటే ఏమవుతుంది?

జవాబు: కప్పు ఖాళీ అవుతుంది.

3. రెండు మామిడి పళ్ళను ముగ్గురు ఎలా పంచుకోవాలి?

జవాబు: రసం తీసి!

4. గుడికి వెళ్ళినప్పుడు బొట్టు దేనికి పెట్టుకుంటారు?

జవాబు: నుదుటికి!

5. బస్సులో ఎంతమంది కూర్చోవచ్చు?

జవాబు: పట్టినంత మంది!

6. ఆఫ్రికా గిరిజనులు అరటిపండు ఎలా తింటారు?

జవాబు: ఒలుచుకొని

7. హుసేన్‌సాగర్‌లో బుద్ధుడు ఒక చేతిని పైకి ఎత్తి ఉంటాడు ఎందుకు?

జవాబు: కింద నీరు పెరిగితే పైకి పోతారని చెప్పేందుకు!

8. ఓ ఇంట్లో బోలెడు డబ్బు నగలున్నాయి. ఒక గజదొంగ ఆ ఇంట్లోకి వెళ్ళాడు. అప్పుడు ఇంట్లో ఎవ్వరూ లేరు కూడాను. అయినా అతను ఆ ఇంటిని దోచుకోలేదు ఎందుకు?

జవాబు: అది తన ఇల్లే కాబట్టి!

9. ఆటలు ఆడని ప్లేయర్ ఏంటి?

జవాబు: సీడీ ప్లేయర్!

10. డ్రైవర్ లేని బస్ ఏది ?

జవాబు: సిలబస్!

11. నాలుకపైన పెట్టుకుంటారు గానీ మింగరు- ఏమిటది?

జవాబు: తపాలా బిళ్ళ!

12. పంజరంలో ఏముంటుంది?

జవాబు: ఏదిపెడితే అదే!

13. తోటలో పండిన మామిడి పండ్లు కోయడానికి సరైన కాలమేది?

జవాబు: తోటమాలి లేనికాలం!

14. వాస్తుశాస్త్రిని బిచ్చగాడు ఏమడిగాడు?

జవాబు: 'ఏ చెట్టు కింద కాపురం మొదలు పెట్టమంటారు?' అని!

15. "పాప" భీతి అంటే...?

జవాబు: 'పాప' అంటే భయపడటం!

# లోలా వాల్టర్స్

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్.*




లోలా వాల్టర్స్ అనే పధ్నాలుగేళ్ళ అమ్మాయి అమెరికాకు చెందిన ఒక జిమ్నాస్ట్- అంటే తెలుసుగా, సర్కస్ ఫీట్లు చేసి-శరీరాన్ని ఎటుపడితే అటు వంచి, తీగల మీద నడిచేసే పాప అన్నమాట. చూసేందుకు మనకి మామూలుగా అందరి లాగానే అనిపిస్తుంది తను. కానీ, అసలు విషయం ఏమిటంటే, తనకి 'నిస్టాగ్మస్' అనే కంటి జబ్బు ఉంది. దీని వల్ల, ఐదు అడుగుల దూరం లోపు ఉండే వస్తువులు మాత్రమే కనబడతాయి. పైగా, కంటి చూపు కుదురుగా నిలవకుండా, కళ్ళు అటూ ఇటూ కదులుతూ ఉంటాయి! దీని వల్ల ఎదురుగ్గా ఉన్న వస్తువు ఎత్తు-లోతు గురించి కూడా సరయిన అవగాహన ఉండదు! మామూలు పనులు చేసుకునే మనలాంటి వాళ్లకే అదెంత కష్టమో కదా, మరి రోజూ బయట ప్రదర్శనలు ఇచ్చే ఒక జిమ్నాస్ట్ కి ఇలాంటి సమస్యలు ఉంటే ఎంత కష్టమో ఊహించుకోండి! మరి అయినా కూడా లోలా జిమ్నాస్టిక్స్ లో తన ప్రతిభతో అమెరికాలో ఎంతో పేరు తెచ్చుకుంటోంది ఇప్పుడు.

"నాతో పోటీ పడే వాళ్ళలో చాలా మంది నాకు ఈ సమస్య ఉన్నట్లు గుర్తించలేరు" అంటుంది లోలా. సాధారణంగా, పోటీలకి వచ్చే న్యాయనిర్ణేతలకి కూడా ఈ విషయం ముందుగా చెప్పరు లోలా వాళ్ళు. పోయిన సంవత్సరం జరిగిన ఒక అమెరికన్ ఛాంపియన్ షిప్ లో న్యాయనిర్ణేతలు లోలా ప్రదర్శనను ఎంతో మెచ్చుకున్నాక తెలిసిందట, ఆ న్యాయనిర్ణేతలకి కూడా - వాళ్ళంతా

ఎంతో ఆశ్చర్యపోయారట.




కంటిచూపు సమస్య ఉంది కదా, అందుకని మిగతా వాళ్లతో పోలిస్తే ఎక్కువసార్లు కింద పడిపోతూ ఉంటుందట లోలా. తనకి తగిలే దెబ్బలు కూడా మిగితా వాళ్లతో పోలిస్తే కొంచెం ఎక్కువే నట. కానీ, పడిన ప్రతిసారీ పైకి లేచి మళ్ళీ ముందుకు సాగిపోతూ ఉంటుందట. పోటీ జరుగుతున్న సమయంలో దృష్టి మందగించినప్పుడు, చేతుల్తో, కాళ్ళతో నేలని ముట్టుకొని చూస్తుందట. అలా ఎదురుగా ఉన్న వస్తువుల ఎత్తు, లోతుల అవగాహన కలిగించుకుంటుందట. అలాగే, వాటిమీది నుంచి దూకాలన్నప్పుడు ఒక్కోసారి తనకి అవతలి ప్రక్కన ఏముందో కనబడదట. అయినా సరే, ఎంత వరకూ దూకాలో ఒక అంచనా వేసుకొని దూకేస్తుందట తను!

కంటి చూపు లోపం వల్ల తనకి లెక్కలేనన్ని సమస్యలు వస్తుంటాయి. అయితేనేమి, లోలా ఆ సమస్యలకు చిన్నబుచ్చుకోదు; కోపగించుకొని ఏడవదు. ఆ సమస్యలనన్నిటినీ తను అధిగమిస్తుంది. ఏదో సాదా సీదా పని చేసుకొని బ్రతుకును ఈడ్వటం కాదు- చక్కని జిమ్నాస్ట్ గా తన ప్రస్థానం కొనసాగిస్తోంది. 'ఎన్ని కష్టాలొచ్చినా దాటటం' అంటే ఏంటో మనం లోలా వాల్టర్స్ నుండి నేర్చుకోవచ్చు.

పట్టుదల, కృషి ఉంటే చాలు- మనం అనుకున్నది ఏదైనా సాధించచ్చు. లోలా లాంటి పిల్లలు మనకి నేర్పేది అదే కదూ? 

# చిన్న చిన్న పిల్లలం

*రచన: శ్రీ వి ఆర్ శర్మ.*
*సౌజన్యం: డా.సి.ఏ.ప్రసాద్, జన విజ్ఞాన వేదిక.*



చిన్న చిన్న పిల్లలం
మల్లెపూల మొగ్గలం
మల్లెపూల మొగ్గలం
రంగు రంగుల ముగ్గులం
ప్రకృతి అందాలు చూద్దమా
పరవశించి గంతులేద్దమా
"చిన్న చిన్న"



స్వాతి వాన చినుకుల్లో
మనము ఒక చినుకౌదాం
సీతాకోక చిలుకల్లో
మనము ఒక చిలుకౌదాం
సిరివెన్నెల చంద్రులౌదమా
వెన్నెల్లో సంద్రమౌదమా
"చిన్న చిన్న"



జామ చెట్ల తోటలోన

రామ చిలుక మనమౌదాం

జాజిపూల చెట్టుకింద

బావి గిలక మనమౌదాం

నిమ్మపూల వాసనౌదమా

నింగిలోన మేఘమౌదమా

"చిన్న చిన్న"

కృష్ణానదిని చుట్టుముట్టు

దట్టమైన అడవౌదాం

గోదావరి నది ఒడిలో

పాడుతున్న పడవౌదాం

మనఊరి చెరువౌదమా

చెరువులోని చేపౌదమా

"చిన్న చిన్న"



# ఉగాది

కవిత

రచన: గమ్యతమ్మిరెడ్డి, 5 వ తరగతి, రిషీవ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.

ఉగాది అంటే నాకు గుర్తొస్తాయి
అమ్మ చేసిన ఉగాది పచ్చడి
బామ్మ చేసిన పిండి వంటలు-
తల్చుకుంటే నోరూరుతుంది.
ఇల్లంతా అలంకరణ
ఇంటిముందు రంగవల్లులు
మనసుకి అహ్లాదాన్ని కలిగిస్తాయి





పెద్దలు చేసే పూజలు
పిల్లలు ఆడే ఆటలు, పాడే పాటలు
సముద్రమంత ఆనందాన్ని
కలిగిస్తాయి

ఇల్లంతా చుట్టాలు
తాతయ్య పలకరింపులు
ఇవ్వన్నీ చూస్తే అనిపిస్తుంది - ఉగాది మళ్ళీ మళ్ళీ రావాలని !

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కొంటికి: 25 రూ.
12 పుస్తకాలకైచందా: **రూ. 300/-**

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కొంటు వివరాలు:

"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'ఎదిగేపిల్లడు' : వీరాంజనేయులు
చిత్రాలు: అడవి, ప్రసాద్, చంద్రకాంత్, లక్ష్మీవెంకట్, రామకృష్ణ, మహేష్.
జోకులు: సత్యలక్ష్మి
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:** ఉషోదయ-చౌడవరంవారికి, ప్రజ్ఞ-అద్దంకివారికి, ప్రభుత్వ ప్రాథమిక-ప్రాథమికోన్నత పాఠశాలలు- తరాలపల్లి వారికి, వియోగి, కార్టూనిస్టు ఏవియం గార్లకి, రాధా రాజశేఖర్ గార్లకి, ఆదూరి హైమవతి గారికి, చిలిపి ప్రశ్నలమూర్తిగారికి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

# పదండి ముందుకు

(పిల్లల నవల)

మంత్రాలు-మాయల్ని ఇష్టపడని పిల్లలెవ్వరు?! వాటన్నిటి వెనకాలా ఏవో మ్యాజిక్కులు లేకుండా పోతాయా? అలాంటి మ్యాజిక్కుల్ని వేరే ఎవరు విడదీసి చెప్పాలి, మాంత్రికులకే మాంత్రికుడు, మెజీషియన్లకే మెజీషియన్- పట్టాభిరామ్ తప్ప!?

ఇరవయ్యేళ్ల క్రితం పట్టాభిరామ్ రాసిన ఈ పుస్తకం పిల్లలందరినీ అలరిస్తుంది. ఇప్పటికీ, ఎప్పటికీ కూడాను! మ్యాజిక్కుల్ని కథలో కలగలిపి అంత చక్కని రుచికరమైన వంట తయారు చేశారు మరి! ఇంత చక్కని పుస్తకాన్ని అచ్చువేసిన బాలల అకాడమీ వారికి మనందరి తరపునా కృతజ్ఞతాభివందనాలు!

ఈ సెలవుల్లో దీన్ని చదివారంటే, ఇక మీరంతా మెజీషియన్లయిపోతారు, చూసుకోండి!




**పదండి ముందుకు**

బి.వి.పట్టాభిరాం(1999)

ఆం.ప్ర. బాలల అకాడమి,

పబ్లిక్ గార్డెన్స్,

హైదరాబాదు.

పేజీలు:63

రూ.8

# కథల కథ

అనగా అనగా ఒక చిన్న కథ తయారైంది. గెంతుకుంటూ, ఆడుకుంటూ పోతోంది ఆకాశంలో. అంతలో దానికొక రామచిలుక ఎదురైంది.

"చిట్టి కథా, చిట్టి కథా! నువ్వు భలే కనిపిస్తున్నావు. నేను నిన్ను తీసుకుంటాను, ప్లీజ్!" అన్నదది.

"తీసుకో, తీసుకో! దాందేముంది? నేనున్నదే అందరికోసం!" అన్నది చిన్న కథ.

రామచిలుక చిట్టి కథను తీసుకోగానే కథలు రెండైనై! చిలకేమో ఒక కథను పట్టుకొని ఎగురుకుంటూ పోయింది- బిగ్గరగా అరుచుకుంటూ.

ఇంకో కథ తన దారిన తను పోతూ ఉంటే చిన్నారి పాప ఒకతె ఎదురైంది దానికి, ఓ చెట్టుకొమ్మను పట్టుకొని.

"ఏం, చిన్నారీ! ఎటు పోతున్నావు, ఒక్కతెవే? మీ అమ్మేది?" అంది కథ.

"అమ్మ పోయి కొమ్మ వచ్చె ఢాం ఢాం ఢాం!" అని నవ్వింది పాప. కథకి పాపను చూస్తే ముచ్చట వేసింది.

అది పాపతో కలిసి పోయి, వాళ్ళ అమ్మనీ, అమ్మమ్మనీ, నాన్ననీ అందర్నీ చుట్టుకొని వచ్చింది.

రామచిలుక అక్కడ అరచుకొంటూ పోతుంటే మొద్దు రాముడు ఎదురయ్యాడు దానికి: "ఏయ్! చిలకా! భలే కథ ఉన్నట్లుందే, నీ దగ్గర? నాకూ చెప్పు! వింటాను!" అన్నాడు వాడు.

"ఊరికే వింటే ఏం లాభం? రాయాలి! నీకు చేతులున్నై కద!" అంది చిలుక.

"ఊఁహ్! ఓహ్! అయ్యో! రాయటం రాదే!" మూలిగాడు వాడు.

"కుదరదు నాన్నా! నన్ను అందుకుంటే రాయాల్సిందే!" అన్నది కథ. "సరే" అని వాడు రాయటం నేర్చుకున్నాడు.

ఈ సారి ఒక్క కథే పది కథలైంది- ఎవరెవరినో చేరింది. అందరికీ చదవటం నేర్పింది.

ఆ కథని చదివిన పిల్లలెవ్వరూ దాన్ని ఆపుకోలేదు- అందరి దగ్గరా అది రెండింతలు అవుతూనే పోయింది. ఆ పిల్లల స్నేహితులు- వాళ్ళ అమ్మా నాన్నలు- వాళ్ళ స్నేహితులు- ఇట్లా పోతూనే ఉంది కథ- అందరూ విన్నారు; అందరూ చదివారు; అందరూ చెప్పారు!

చాలా ఏళ్ళ తర్వాత మాకు చెప్పిందొక పాప, ఆ కథని- "ఓయ్, కథా! రా! నిన్ను కొత్తపల్లిలో వేస్తాం" అన్నాం మేం.

"మా బాగా వేసుకోండి! నేనున్నదే అందరికోసం!" అన్నది కథ.

"సరేగానీ, నిన్నెవరు తయారు చేశారు, మొదట?" అడిగాం, మేం, పెద్దవాళ్ళం.

"అయ్యో! నేను ఎన్ని చోట్ల తిరిగాను, ఎంత మారాను! ఎప్పుడో ఒక రామచిలుక పాడింది నన్ను! ఒక మొద్దు రాముడు రాశాడు నన్ను! కానీ ఎందరు పిల్లలు బ్రతికించారో, ఏం చెప్పను? ఎంతమంది పెద్దలు మెచ్చి కాపాడారో, ఏమనను? మీరేమైనా మొదటివాళ్ళా? మీ పని మీరు కానివ్వండి! నా దారిన నేను ఎగురుతూనే ఉంటాను" అని నవ్వింది కథ.

ఇదీ, ఈ కథల కథ!

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada,Phone:08662579129